# మన జమీందారీలు

37 117/11

★

రావోయి రావోయి రైతన్నా
రాజ్యాలు మార్చాలి రావోయి
రాజ్యచక్రము నీదు చేతులో నుండాలి
కోతరాజులింక బూజు పట్టించవేవోయి.

వేంకట్రామ అండ్ కో

గొట్టిపాటి వెంకట సుబ్బయ్య

దేశీ ప్రచురణ సం. 6 ప్రథమ ముద్రణ ఏప్రియల్ '44.
వెల: రూ పా యి. హక్కులు కర్తవి.

# అంకితం

నడుము సాగకట్టుకొని నవధాన్యములు పండిం
చుచు అష్టకష్టము లనుభవించుచున్న
అమాయక రైతాంగ రక్షణకై
కలకాలము నుండీ
ప్రయత్నించి
కాల
వాహినితో
కలిసిపోయిన వారిని
కీర్తికాంచిన వారిని
స్మరించి దేశకాల జాతిమత
లింగ రాజకీయ విభేదములను
విస్మరించి నట్టివారందరకు అంజలితో అర్పితము.

దేశికవితామండలి
ఘంటశాల :: కృష్ణాజిల్లా

# పరిచయము

జమీందారీపద్ధతి దేశాభివృద్ధికి ప్రతిబంధకం. జాతీయతావృక్షాని కది చీడపురుగు. ఈ పద్ధతి దేశంలో వున్నంతకాలమూ పేదరైతుకు కడుపునిండా కూడూ, వొంటినిండా బట్టా, కంటినిండా నిద్రా దొరకడం అతి కష్టం.

ఎంత ప్రయత్నించినా పులిచర్మంమీద చారలు తీసివేయలేనట్లు ఎంత మరమ్మతుచేసినా జమీందారీలలోని ప్రజాపీడన తగ్గించలేము. కర్షకుని కండలుపిండి త్రాగితేనేగాని జీవించలేని యీ పద్ధతికి సంస్కరణ వైద్యము పనిచేయదు. బ్రహ్మజెముడులాగు యిది మరమ్మతుకు లొంగేదికాదు.

అసలీపద్ధతి అనర్థదాయకమైనది. దేశప్రజలనుండి పన్నులు వసూలుచేసి విదేశ ప్రభుత్వాలకు చెప్పడానికేర్పడిన అజాతీయ పద్ధతి యీ జమీందారీపద్ధతి. అమాయికులగు గ్రామస్థులనుండి నిరంతరమూ ఏదోరూపంగా ధనాన్ని రాబట్టుకొంటూ, ప్రజాజీవితంతో సంబంధం లేని విడ్డూరపు భోగాలతో కాలంగడిపే జమీందారులు ప్రజాపురోభివృద్ధికి ఏవిధంగా దోహదం చేయగలుగుతారు ?

కాంగ్రెసు ప్రభుత్వం జమీందారీ రిపోర్టును తయారుచేసేటప్పుడు అన్నివిషయాలూ సాకల్యంగా చర్చించి గ్రహించిన మాజీ మద్రాసు గవర్నరు లార్డ్ ఎర్స్కిన్‌గారు తమ ఉద్యోగానంతరం లండనులో ఉపన్యసిస్తూ 'జమీందారీపద్ధతి ఏనాడో పోవలసింది. అది ఇక పనికిరాద' ని చెప్పారు.

ప్రజానాయకులేకాదు, ప్రభుత్వోద్యోగులేకాదు; చివరకు కాలగతి నర్థంచేసుకోగలిగే కొందరు జమీందారులుకూడా యీ పద్ధతిలోని

దోషాన్ని ఎత్తిచూపి, సవరణల్ని ప్రతిపాదించారు. కాని, జమీందారులు ప్రజాభిప్రాయాన్ని మన్నిస్తారా? అంతరాత్మ ప్రబోధాన్ని ఆలకిస్తారా?

నేడుకూడా జమీందారీలలో జరిగే ఘోరాలకు అంతులేదు. కొన్ని జనసామాన్యానికి తెలియవు. పైనుండి క్రిందివరకూ వొకటే మచ్చు. వొకటే అద్దకం. 'డిజైన్ బిల్డింగు' లాగు వొకరినిచూస్తే యింకొకరినిచూడ నగత్యం వుండదు.

ప్రజాస్వామికాలంటే జమీందారులకు ఏవగింపు. ప్రజాసంఘాలంటే వీరికి ఎగతాళి. ప్రజానాయకులంటే వీరికి కంటగింపు.

అసలు ప్రజలను వీరు కన్నెత్తిచూస్తారా! వీరిదంతా ఊర్ధ్వదృష్టీ, ఉగ్రసంభాషణా, ఉత్క్రోషచర్య. మంచిచెడ్డలతో వీరికి సంబంధంలేదు. పంతంకోసం, ప్రతిష్టకోసం వీరు చేసే పనులనుగురించి ఎన్నో భారతాలు వ్రాయవచ్చును.

వీరిలో పూర్వకాలమువారికీ, నేటికారుకీ ఏమీ భేదంలేదు. ప్రజాపీడన రానురాను ఎక్కువౌతుంది. వీరి దుబారాఖర్చు రోజుకంటే రోజుకు ఎక్కువౌతుంది. పూర్వం సాహిత్యంమీదా, సానులుమీదా జమీందారులు డబ్బు ఖర్చుచేస్తే, యిప్పటివారు గుర్రపు పందెములమీదా, సినీమాస్టారులమీదా విపరీతంగా వ్రయంచేస్తున్నారు.

ఈ జమీందారీల పుట్టుపూర్వోత్తరాలు గురించి ప్రజాసామాన్యానికి తెలిపే పుస్తకాలంతగా తెలుగులోలేవు. ఈ లోటును శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు ప్ర [illegible]శారు.

శ్రీ వెంకటసుబ్బయ్యగారు చల్లపల్లి జమీ[illegible]న ఘంటశాల వాస్తవ్యులు. చిరకాలము జాతీయోద్యమములో పనిచేసిన జమీనురైతు. సంస్కృతాంధ్ర హిందీ వంగ ఆంగ్లభాషలలో పాండిత్యమున్న

సాహిత్యాభిమానులు. సాహిత్యకులుగా ఆంధ్రదేశానికి వీరిదివరకే చిరపరిచితులు.

వీరిప్పుడు రచించిన "మన జమీందారులు" అనే గ్రంథము ఆంధ్రదేశములోని రైతుజనాంగానికి ఎంతో ఉపయుక్తంగా వుంటుందని భావిస్తున్నాను. శ్రీ వెంకట సుబ్బయ్యగారు ఎంతో శ్రమతో అనేక విషయాలు సంగ్రహించి, సామాన్య రైతుకుకూడా అర్థమయ్యేటట్లు వ్రాసి ఆంధ్రదేశానికి గ్రంథమర్పించినందుకు వారి నెంతయు అభినందించుచున్నాను.

మదరాసు
10-4-1944.

బి. యస్. మూర్తి
మాజీ పార్లమెంట్ కార్యదర్శి

## అభిప్రాయాలు

స్వదేశ సంస్థానాలకూ, జమీందారీలకూ భేదంవుంటే, అది పెద్ద దెయ్యానికీ, చిన్న దెయ్యానికీ మధ్యగల భేదం వంటిదే. ఈ విషయాన్ని ఈ గ్రంథం ఉత్తమంగా నిరూపిస్తున్నది.

—నార్ల.

*

జమీందారీ - విధానమంటే యేమిటో తెలియని జనానికి, అందులోని ఘోరాలు గుండెకు హత్తుకొనేట్లు రాశారీ పుస్తకంలో గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు. అందుకు వారెంతయూ అభినందనీయులు.

—షూరి.

# విన్నపము

భారతదేశము కనివిని యెరుగని 'ఆబ్సెంటీ ల్యాండు లార్డ్సు' అను ఒక వింతజాతిని (జమీందారులను) ఈస్టిండియా ప్రభుత్వము సృష్టించినది. ఆ ప్రభుత్వము మారి బ్రిటీషు ప్రభుత్వము వచ్చినా జమీందారీ విధానము యధాతథంగానే వున్నది. ఈ విశ్వామిత్ర సృష్టివల్ల అనేక అనర్థాలు కలుగుచున్నవి. ఈ పద్ధతి ఒక రైతాంగమునే నాశనము చేయుటలేదు. దీనివల్ల భారతజాతి అభివృద్ధి అరికట్టబడినది. నాగరికత నాశనమగుచున్నది. మానవప్రకృతే మారుచున్నది. దీని గాలిసోకినంత వరకు మానవులు మహామ్మారి సోకినట్లుగ మలమలమాడిపోవుచున్నారు.

అనుమానముంటే అధికారులేమంటున్నారో ఆలించండి. ఈ పరమ ప్రయోజకుల ప్రయోజకత్వమునుగురించీ, ప్రయోజనమునుగురించీ 1828–35 గవర్నరు జనరలుగనున్న విలియం బెంటిక్కు ప్రభువు ఇటుల చెప్పెను "అనేక విషయములలో పర్మనెంటు సెటిల్మెంటు నిరుపయోగమైనదనే చెప్పవచ్చును. కాని దేశవ్యాపితమైన తిరుగుబాటునుగాని, అశాంతినిగాని అణచుటలో ఇది వుపయోగమైనదనుటలో సందేహము లేదు. ప్రజలమీద పూర్తి పలుకుబడిగల యీ ధనిక జమీందారీవర్గ ప్రయోజనములు బ్రిటీషు ప్రభుత్వము నిలిచివుంటేనే రక్షించబడి వుంటవి. అందుచేత యీ జమీందారి పటాలమంతా ప్రజా విప్లవమునకు ప్రతిరోధకముగా వుపయోగపడును. ఇది ఒక్కటే దీని ప్రయోజనము."

Speeches and Documents on Indian policy 1750-1921 Vol' I. P. 215.

ఇట్టి జమీందారీపద్ధతిని భారతదేశమంతటను వ్యాపింపచేయవలసినదని రమేశ చంద్రదత్తుగారు 1902 లో ఆందోళన చేయగా అప్పటి రాజప్రతినిధియగు కర్జను ప్రభువు కాదని ఇలా వివరించెను: "స్వంతముగా భూములను సాగుచేయని భూస్వాము లొనర్చు అన్యాయము లెరుంగుదుము. జమీందారీ వుద్యోగులు చేయు దుర్మార్గములు తెలుసు.

రైతు జమీందారుల మధ్య పెరుగుచున్న వివాదాలు కలవు. మధ్యవర్తుల సంఖ్య పెరిగి భూమినుండి వచ్చు ఆదాయమును అన్యాయముగ అపహరించువారిసంఖ్య హెచ్చుట గమనించుచున్నాము. రైతురక్షణకై జమీందారీ పద్ధతిని ఇతర ప్రాంతములలో ఏర్పరచుట శ్రేయమని గుండెపై చేతినిడుకొని చెప్పజాలము.''

మనదేశమును కొల్లగొట్టుచున్నారని మన కష్టసుఖములను గమనించరని దేశనాయకులచే చెప్పబడుచున్న ప్రభుత్వ ప్రధానోద్యోగులు జమీందారులు చేయు అనర్థకములనుగురించి అరమరలేక చెప్పుచుండ, మనదేశము నుద్ధరించాలని వుబలాటపడు కొందరు నాయకులు, కవులు, పత్రికాధిపతులు ప్రచురణకర్తలు, ఈ జమీందారులు భాషాపోషకులని, కళోద్ధారకులని, విశ్వదాతలని, వదాన్యులని సహస్రవిధముల స్తుతించుచు, వారి వల్లనే మనము అభివృద్ధి పొందుచున్నటుల ప్రకటించుచున్నారు. ఇందేది సత్యము ?

నిజమాలోచించిన వీరు అన్నివిధముల అభివృద్ధి నిరోధకులే. అమాయక రైతాంగమునుండి ధనమనేకవిధముల గుంజుతూ, వారిని గర్భదరిద్రులును గావించి దాస్యకూపములో పడవేయుచున్నారు. ఈ విధముగా అశేషజనమును ఆర్థికముగ క్రుంగదీసి, వారిని చదువు సంధ్యలనుండి, విజ్ఞానవికాసములనుండి, వంచితుల చేసినవారు కళాపోషకులు, భాషాపోషకులు, దేశహితైకపరులు అనుట ఆత్మవంచన, పరవంచన, దేశారిష్టము.

చట్టం చాటున చట్టవిరుద్ధముగను జమీందారులచే దోపిడీచేయబడి బ్రతుకుతెరువునకే భంగమువాటిల్లిన యీదైన్య ప్రజాసముదాయము పత్రికలు, పుస్తకములు కొనరని, కళాభిరుచి లేదని ఎంచుట తమతమ నెలవులు తప్పి, తమ బాధ్యతలు నిర్వర్తించక రైతాంగపు కష్టార్జితమునంతయు కొల్లగొట్టుచు, విందులు చిందులు, విలాసములు వినోదములు, అనవసర వ్యవహారములు, యెలక్షనులు, పోలోఆటలు, గిండీరేసులు మొదలగు దుర్వ్యసనములకు లోనై దుర్వ్యయము చేయుచు, లోకమును భ్రమపెట్టుటకు కించిన్మాత్రము ఏ సభకో, సమాజమునకో, పరిషత్తునకో,

పణ్డితున్నక్తో యిచ్చినంతమాత్రమున వీరు పుణ్యపురుషులుగాను, పూజనీయులుగాను తలంచుట భ్రమ. నూటికి పెట్టి కోటిని గొరిగించువారు ఈ జమీందారులు తప్ప జగత్తులో మరొకరు మచ్చునకు కూడ మనకు కానరారు. అఖండ మేధావులు, మహా త్యాగులు, ఆయా విషయముల్లో ఆరితేరినవారుండగా, కొందరు ప్రజాస్వామిక కాలములో, నాలుగు రాళ్ళ కాశపడి, ప్రజాకంటకులు, విలాసపురుషులు అగు జమీందారుల తీసుకొచ్చి అయిన దానికి కానిదానికి గద్దెనెక్కించి తాము గంతులు వేయుట, వారి ఆర్థిక నైతికపతనమునకు జమీందారీ మనస్తత్వమునకు నిదర్శనము. వీరితో పొత్తు ఎంత త్వరగ విడనాడిన అంత శ్రేయస్కరము.

వేయేల? గత యెస్సెంబ్లీ యెన్నికలలో మన మద్రాసు రాజధానిలోని జమీందారులంతా మన మాతృసంస్థ అగు కాంగ్రెసును ధిక్కరించి పోటీచేయుట సర్వజనవిదితమేకద! వీరే కాదు యావద్భారతదేశమునందును యీ జాతి ఇటులనే ప్రవర్తించి తన సహజస్వరూపస్వభావమును వెల్లడించగా, ఏలకో ఎండమావులెంట పరుగులిడుట? కాన భారతభూమికి ప్రబల అనర్థదాయకమగు యీ జమీందారీ విధానమును రూపుమాపుట ప్రథమ కర్తవ్యము.

ఈ విశాల భారతదేశములో అర్థభాగము పరభాగ్యహారుల పాదాక్రాంతమైయున్నది. ఇట్టి విపుల విస్తారభూమిని స్వాధీనమునందుంచుకున్న జమీందారులనుగురించి గాని, తద్విధానమునుగురించిగాని, వీరి దారుణ పరిపాలనాపద్ధతిని గురించిగాని విపులగ్రంథమేదైన దేశభాషల్లో కలదా అని విచారించితినిగాని అట్టిదేదీ వున్నట్లు గోచరము కాలేదు.

ఈ లోపమును పోగొట్టుటకు నేను నడుముకట్టుట, నాకు గల శక్తికంతె యథార్థమును లోకమున కెరుకపరచవలెనని ప్రబల కాంక్షయు, బాధానుభవములే ప్రోద్బల కారణములు. ఇందుచే అందందుగల విషయము లొకచోట చేర్చితిని. ఇందు నా ప్రయాస తప్ప ప్రయోజకత్వమేమియు లేదు. ఇందుగల మంచి అంతయు ఆయా మహానుభావులకే చెందును. చెడ్డదైనా వుంటే సాహసించిన నాదే.

ఈ గ్రంథమున ఆయాచోట్ల కొన్ని మాత్రమే ప్రమాణములు చూపబడినవి. ప్రతి విషయమునకు ప్రమాణ ముదహరించుటచే సాధారణ రైతాంగమునకు తికమకగ నుండుటయే గాక ఈ కరువుకాలములో ఇంకను గ్రంథము పెరిగి అందరకు అందుబాటులో లేకుండ పోవును. ఈ కారణములచే విడువబడినవి, గాని ప్రతివిషయము గ్రంథాధారముమీదనే వ్రాయబడెను.

ఈ గ్రంథరచనకు జమీన్ రైతు, కృష్ణాపత్రిక, ఆచార్య రంగాగారి రచనలు, యద్దనపూడి వెంకటరత్నంగారి వ్యాసములు అధికముగ తోడ్పడుటచే వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

కామ్రేడ్ శెట్టిపల్లి అల్పకాలములో తన అనల్ప రైతుగీతములచే రైతులోకమును మేలుకొలిపి, నేడు కర్షకజాతీయాత్మలో లీనమయ్యె. ఆయనగీతములు తదితర రైతువైతాళికుల గీతములు ఇందు చేర్చుటచే వారికి ఋణపడితిని. ఇటుల చేర్చుటలో వారి ఇంగితమెరిగే ప్రవర్తించితినని వినమ్రుడనై విన్నవించుకుంటున్నాను.

ఇందలిభాష రైతాంగపు బ్రతుకువలెనే యున్నది. అచ్చు అందచందాలు అచ్చంగా అలాగే వున్నవి. అయినా ఆర్ద్రహృదయులు ఆదరించక పోవుదురా?

మా దుర్భరజీవితము జమీందారుల నిజస్వరూపము ఇందు చేతకొలది చెప్పబడెను. ఇది ఎంతవరకు సహృదయలోకమునకు అపీలు కాగలదో! దీని మంచిచెడ్డలు, విబుధవర్గమునకు విడిచి, ఈ గ్రంథ ప్రయోజనమును పొంద సోదర రైతాంగమునకు విన్నవించుతూ, ఉడుతాభక్తిని వారి వుపయోగమునకై దీనిని రచించుటలో నేను కృతార్థుడనైతినని తలచెద.

రాజకీయ నాయకులకు. రచయితలకు మరొకమనవి. 'Educate our masters' 'మన యజమానులను విజ్ఞానవంతులనుగా చేయమని చెప్పె నొక రాజకీయవేత్త. ఇదెంతయు అవసరము. యజమానులంటే నల్లదొరలని తెల్లదొరలని అనుకొందురేమో బానిసబుద్ధులు. యజమానులంటే ప్రజలే. మన రాజకీయనాయకులు ప్రజానీకముతరఫున తాము

పోరాడుటతోనే తృప్తినొందక వారె పోరాడునట్లుచేయుట అత్యావసరము. అది సాహిత్యమువల్లనె సత్వరసాధ్యమన్న సంగతి గ్రహించి యత్నించిన ప్రజలకు శక్తియుక్తి, భుక్తిముక్తి కలుగును.

కర్షకులు, కవులు ఏకజాతీయులే. కర్షకులు నవధాన్యములు పండించుదురు, కవులు నవరసములు. విచారకరమగు సంగతేమన వారిలో కర్షకుడు కత్తిగలవానికి లోబడెను, కవి కాసులు గలవాడికి దాసుడయ్యె. కొందరు కవులు రాజులను ధిక్కరించినవారు లేకపోలేదు. కాని కర్షకులకై కలముబట్టినవారరుదు.

అయినదేమో అయినది. మనం వుభయులం అన్నదమ్ములం. కాసులు గలవాడికి అమ్ముడుపోవద్దు, పోనీయవద్దు. ఆత్మగౌరవము గలిగి అభివృద్ధి పొందుదము.

అన్నలగు మీరు తమ్ములలుగు మాకు చేయూతనిచ్చి విజ్ఞాన వీధుల్లో విహారింప చెయ్యాలి.

అప్రియసత్యములు పలికినందులకు మన్నించ అశక్తతకు క్షమించ లేడెద.

నా అల్పరచనయందాదరము వహించి తమ అమూల్యకాలము హెచ్చించి పరిచయము వ్రాసిన ప్రజ్ఞాశాలురగు బి. యస్. మూర్తిగారికి మోవాకములు.

ఇట్లు,

ఘంటశాల 0-4-1944

పీడిత రైతుసోదరుడు
గొట్టిపాటి వెంకటసుబ్బయ్య.

# విషయసూచిక


| విషయము | | | పుట |
|---|---|---|---|
| 1. | భూమి హక్కెవరిది ? | ... | 9 |
| 2. | భూముల పైసలాలు | ... | 12 |
| 3. | జమీందారుల పుట్టు పూర్వోత్తరాలు | ... | 14 |
| 4. | పర్మనెంటు సెటిల్మెంటుకు కారణములు | ... | 17 |
| 5. | పర్మనెంటు సెటిల్మెంటు పద్ధతి | ... | 18 |
| 6. | వివిధప్రాంతముల జమీందారులు | ... | 20 |
| 7. | జమీందారీలంటే ? | ... | 21 |
| 8. | జమీందారీపద్ధతి విస్తరణ | ... | 22 |
| 9. | జమీందార్ల ఆదాయము | ... | 22 |
| 10. | మన మద్రాసుజమీందార్ల ముడుపు | ... | 23 |
| 11. | మద్రాసురాజధాని జమీందారీలు | ... | 25 |
| 12. | మన ఆంధ్ర జమీందారీలు | ... | 26 |
| 13. | పన్నులా, పబ్లికు దోపిడీలా ? | ... | 27 |
| 14. | తెల్లదొరతనము : నల్లదొరతనము | ... | 29 |
| 15. | జమీందారీలు : జబర్దస్తీలు | ... | 30 |
| 16. | అయోధ్య తాలూకాదారుల అక్రమవసూళ్లు | ... | 32 |
| 17. | జమీందారీ విధానము జననాశనకరము | ... | 34 |
| 18. | జమీందార్లకుండే రక్షణలు | ... | 37 |
| 19. | జమీందార్ల దుర్వ్యయములు | ... | 38 |
| 20. | పీఠికాపురాధీశులు | ... | 42 |
| 21. | సంస్థానోద్యోగులు | ... | 48 |
| 22. | జమీందారులు : ఆహారసమస్య | ... | 51 |
| 23. | జమీందార్లంటే ద్వేషం యెంచేతా ? | ... | 56 |
| 24. | జమీందారీ విధానము నూతన ఆర్థికవేత్త | ... | 61 |
| 25. | ,, రివిన్యూబోర్డు | ... | 62 |
| 26. | ,, మారిస్ | ... | 63 |
| 27. | ,, గెలట్ | ... | 64 |
| 28. | ,, ఆచార్య రంగా | ... | 66 |
| 29. | ,, మండేశ్వరశర్మ | ... | 68 |

30. ,, బ్రహ్మయ్య ... 70
31. ,, జవహర్లాల్ నెహ్రూ ... 72
32. ,, జయప్రకాశ నారాయణ ... 73
33. ,, యం. యన్. రాయి ... 75
34. ,, స్వామీ సహజానంద్ ... 76
35. ,, లాసన్ ... 80
36. ,, కృష్ణా పత్రిక ... 84
37. రైతుసమస్య వివిధదేశములు ... 85


# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 10 | 9 | నా | న |
| 10 | 10 | జె | జై |
| 11 | 5 | నడి | నడ |
| ,, | 23 | రజీయతి | రంజతీతి |
| 12 | 3 | మృణేన | తృణేన |
| 15 | 19 | framer | farmer |
| 17 | 5 | డే | డీ |
| 21 | 22 | రవిన్యూ | విలేజన్సు |
| 23 | 4 | 22 | 422 |
| 23 | 19 | హ్రా | హా |
| 32 | 1[illegible] | అర్ధ | అర్ధం |
| 34 | 3 | స్ప | స్వ |
| 43 | 23 | 260464 | 269464 |
| 55 | 16 | వక్ర | తీవ్ర |
| 91 | 2 | వోఢించ | తోడించ |



# మన జమీందారీలు

## భూమి హక్కెవరిది ?

భూమి హక్కు రైతుదా రాజుదా అనే మీమాంస కలదు. జమీందారీ కమిటీ వారు కూడా దీనిని చర్చించారు. జమీందారులు నాటికీ నేటికీ భూమి హక్కు తమదిగా భావించడమే గాక వాదిస్తున్నారు. ఇందలి యథార్థము విచారింతము.

ఇది ఒక్క విషయమువల్లనే తేలగలదు. హక్కు, బేహక్కు లనుగూర్చి నిర్ణయించే ముందు రైతుముందా? రాజుముందా? అనే సమస్యకు సరియైన సమధానము చెప్పగల్గినట్లయితే హక్కు నిర్ణయ సమస్య చాలా తేలికగా తెలియగలదు. రైతు యేర్పడిన కొన్నాళ్లకు రాజు యేర్పడిన సంగతి చరిత్ర జ్ఞానముగల వారందరకీ తెలిసిన విషయము గదా !

ఇంతే గాక విజ్ఞులు శాస్త్రకారులు దీనిని గురించి యేమి చెప్పినదీ విచారింతము.

ప్రఖ్యాత న్యాయ శాస్త్రవేత్తయు ప్రజానాయకుడునైన సి. విజయరాఘవాచారిగారు 1906 సం॥ లో కలకత్తా కాంగ్రెసు మహా సభలో యిట్లు చెప్పిరి. "హిందూ దేశములో భూమి హక్కు యెప్పుడును రాజునకు చెందినదిగా తలచబడలేదు. వ్యవసాయము

చేసినవారిదే భూమి. రాజు కేవలము సంరక్షకుడు. రాజు తాను ప్రజలకు చేసిన వుపకారమునకు ప్రతి ఫలముగా పంటలో కొంత భాగము పుచ్చుకొనెడి వాడు. భూమి రాజుదనే భావము కేవలము పాశ్చాత్యులది కాని భారతీయులది కాదు."

మన ధర్మాలన్నింటికీ మనుస్మృతి కదా ఆధారము. మనువు చెప్పినమాట మనవారు వినవలసినదేగా! "స్థాణు చ్ఛేదస్య కేదార మాహు శల్యవతో మృగం" (9 అ. 44 శ్లో) వనము నరికి సాగుచేసిన వానిదే భూమి. బాణముతో కొట్టిన వానిదే లేడి."

ఇది మిక్కిలి యుక్తి యుక్తముగా లేదా? యింతే గాక "న భూమి స్స్యాత్సర్వాన్ ప్రత్య విశిష్టత్వాత్" (జైమిని). భూమి ప్రజలదిగాన రాజు భూమిని దానము చేయరాదు.

పై విషయములన్ని రాజునకు పన్ను యిచ్చుట పృథ్వీపతి యగుట వలనగాక ప్రజాపాలకుడగుట వల్లనని రుజువు చేయుచున్నవి కదా?

మహమ్మదీయులచే చిరకాలము పాలింపడిన మనము భూమి హక్కును గూర్చి వారి ధర్మము లేమి చెప్పుచున్నవో విచారించవలసి యున్నది. "బంజరు భూములను సాగుచేసిన వానికి దానిపై సర్వ హక్కులు వున్న"వని ఖురాను చెప్పుచున్నది.

కాని సప్త సముద్రాలు దాటి జేరిన ఆంగ్ల వర్తకులు హిందూ దేశమునకు ప్రభువులైరి. వారు హిందువుల ప్రాచీన పద్ధతులనుగాని మహమ్మదీయుల రాజ్యాంగ సిద్ధాంతములను గాని గమనింపక భూమి హక్కు రాజుదేననే తమ దేశాచారమును యీ దేశమున కూడా వర్తింపజేసిరి. యీవింత మార్పువల్లనే రైతాంగ స్థితి నానాటికి క్షీణించి నేటి అధోగతికి కారణమైనది.

జమీందారీ శబ్దము పారసీకము గాన యీ జమీందారీ విధానము మహమ్మదీయుల పాలనలో నేర్పడినదని చాలామంది భావించుచున్నారు; కాని యిది కేవలము పొరపాటు. నేటి కలెక్టరు వుద్యోగము యెట్టిదో మహమ్మదీయ ప్రభువుల నాటి జమీందారీ వుద్యోగము కూడా నట్టిదే. కాని నేటి ప్రభుత్వమునకు ప్రజలకు మధ్య నడీ మంత్రముగా సృష్టింపబడినదీ ప్రస్తుత జమీందారీ విధానము.

యధార్థము తెలిసిన పాశ్చాత్యుల భావములు కూడా గమనించవలసియున్నది. హట్సన్ దొరగారీ విధముగా వ్రాసిరి "శాస్త్ర సమ్మతముగా గాని ఆచార బద్ధముగా గాని జమీందారులకు శిస్తు పెంచుటకు అధికారములేదు. రైతులే భూమి హక్కుదారులు. పర్మనెంటు సెటిల్మెంటు ద్వారా యేర్పరచిన శిస్తు వసూలు చేసుకొనుటకు మాత్రమే జమీందారులకు హక్కు గలదు. ఈపరిస్థితులలో ప్రభుత్వము గాని ప్రభుత్వ ప్రతినిధులు గాని ప్రభుత్వముచే నియమింపబడిన జమీందారులు గాని భూకామందులు యెన్నటికిని కారు."

జమీందారీ కమిటీవారు కూడా భూమి హక్కు రైతునకే జెందినదిగా నిర్ణయించిరి.

కాని యేకాకిగా రిపోర్టు వ్రాసిన మీర్జాపురం జమీందారు గారు భూమి హక్కు మాదేనని మీసము దువ్వుచున్నారు. రాజు పృథ్వీపతి గాన భూమి హక్కు రాజుదే నంటారు. తాము ప్రభువులు గాన తమదేనంటారు. తతిమ్మా వారిని తందానతాన అనమంటారు. ఎంత అమాయకుడు! ఆ మహారాజు!

"రాజా ప్రకృతి రంజనాత్" ప్రజలను రంజింప జేయువాడు రాజు. "ధర్మేన పరిరంజయతి రాజా" ధర్మముచేత సంతసింపజేయువాడు రాజనబడును. రాజు జీతగాడు. నూర్గురు ప్రజలు అసమ్మతి దెల్పి

నచో రాజ్యమును వదలుకొనవలెను (శుక్రనీతి) రాజు ప్రజాసేవకుడు గాని. నిరంకుశాధిగారి గాడు. (మను 7 అ, 144 పు.) "తే అయం విశాన రాజానం వృణేన" (ఐతరేయ బ్రాహ్మణము.) ప్రజలు రాజును ఏర్పరచుకొన్నట్లు అని—యీ విధంగా మన సాహిత్యమంతా రాజు ప్రజా సేవకుడని ఘోషిస్తూవున్నది.

మన ప్రాచీన సాహిత్యమును సమ్యక్ దృష్టితో పరిశీలించినట్లయితే భూమి హక్కు ప్రజలదే ననిన్నీ, రాజు నేడు ప్రజాస్వామిక ప్రభుత్వములోని ప్రసిడెంటు కంటె అధికుడు కాడని బోధ పడుచున్నది గదా !

రాజులే తరాజులగుచున్న ఈ రోజులలో భూమియొక్క హక్కు బేహక్కులను గూర్చి యింకా శాస్త్ర చర్చ చేయుట అపహాస్య కారణము కాకపోదు.

## భూముల ఫైసలాలు

మన హిందూదేశము రాజకీయముగ స్వదేశ సంస్థానములు, బ్రిటిష్ యిండియా అని రెండు ఖండములుగా నున్నది. ఈ స్వదేశ సంస్థానములు 563 కల్గి మన దేశ విస్తీర్ణములో 3-వ వంతునూ, జన సంఖ్యలో 5-వ వంతునూ ఆక్రమించియున్నవి. ఈ సంస్థానమందలి రాజులు బ్రిటిషు ప్రభుత్వముతో ఒడంబడికలు చేసుకొని వారికి కొంత కప్పము కట్టుచూ ప్రజలను నిరంకుశముగా పరిపాలించుచున్నారు.

ఇక బ్రిటిష్ యిండియాలో ప్రభుత్వమువారు 1 శాశ్వత పద్ధతి (అనగా జమీందారీపద్ధతి) 2 గ్రామ పద్ధతి (మహల్వారీ పద్ధతి) 3 రైతువారీ పద్ధతి అని మూడు పద్ధతులను అమలులో పెట్టిరి.

శాశ్వత పద్ధతి ;—దీనినే పర్మనెంటు సెటిల్మెంటందురు. దీనికే మీందారీ విధానమని నామాంతరము. కొంత భాగమునకు ఒకనిని

భూమఖాండుగా జేసి వానినుంచి తీసుకొనే మొత్తమును శాశ్వతము చేసిరి. దీనిని మొట్టమొదట కారన్‌వాలీసు 1793 సం. మార్చి 22-వ తారీఖున బెంగాలు రాష్ట్రములో ప్రవేశపెట్టెను. ఈ పద్ధతి నేడు బెంగాలు, బీహారు, అస్సాం, సంయుక్తరాష్ట్రములు, మద్రాసు రాష్ట్రములలోగలదు. ఇండియాలో యీ పద్ధతి క్రింద నూటికి 19 వంతులు భూమి వున్నది.

గ్రామ పద్ధతి :—దీనినే మహల్వారీ పద్ధతి యందురు. ఇది కూడా స్వల్ప భేదముతో జమీందారీ పద్ధతికి చెందినదే. ఈ గ్రామపు ఎస్టేట్లపై అధికారము ఒక భూస్వామికి గాని, కొందరు భూస్వాములకు గాని కలసియుండును. అనుభవదార్లందరకు కట్టుబడి నిచ్చు బాధ్యత కలదు.

దీనిని హోల్టు మెకంజీ అనునతడు 1822 సం. వుత్తర హిందూస్థానమున అమలులోనికి తెచ్చెను. నేడీ పద్ధతి పంజాబు సంయుక్త పరగణాలలో అధికముగను, మధ్య పరగణాలు మొదలగు ప్రాంతములలోను కలదు. ఇది 30 సంవత్సరముల కొకసారి సెటిల్మెంటు చేయబడును. మధ్య పరగణాలలో మాత్రము 20 సం. కొకసారి చేయబడును. ఇది టెంపరరీ సెటిల్మెంటు పద్ధతి. ఈ పద్ధతి క్రింద నూటికి 30 యకరములు భూమి వున్నది.

రైతువారీ పద్ధతి —మధ్య మనుష్యులు లేకుండా ప్రతి రైతు తోను శిస్తు నిర్ణయమును ఏర్పాటు చేసుకొను పద్ధతి.

దీనిని కెప్టెన్‌రీడ్, థామస్ మన్రో అనువారలు 1798 సం॥ లో ఏర్పాటుచేసిరి. ఈ పద్ధతి మన రాష్ట్రములో అధికముగాను బొంబాయి ప్రాంతము నందంతటను అమలులో నున్నది. ఇది 30 సం॥ కు ఒక సారి సెటిల్మెంటు జరుగుచుండును ఈ రైత్వారీ విధానము క్రింద నూటికి 51 యకరములు సాగు చేయబడుచున్నది.

ఈ పద్ధతుల మంచి చెడ్డలను గురించి నేను వ్యాఖ్యానము చేయుట మాని ఆధునిక యుగ ప్రవక్తయైన మార్క్సు మహాశయుని భావముల నిచ్చట తెల్పుచున్నాను. "ఏదేశ చరిత్రలోనైనా హాస్యాస్పదములూ, నిష్ఫలములూ (ఆచరణలో అపకీర్తి కరములుకూడాను) అయిన ఆర్థిక నిర్మాణ ప్రయత్నాలూ, పరిశోధనలూ, వరుసగా జరుపబడి నాయంటె, అది యిండియాలో ఆంగ్ల పరిపాలనా కాలములో బెంగాలు రాష్ట్రములో ఆంగ్ల భూస్వామ్య పద్ధతికి అనుకరణముగా ఒక దిష్టిబొమ్మను తయారు చేశారు. దక్షిణ దేశములో రైతువారీ పద్ధతిని అనుకరించారు. పశ్చిమోత్తర పరగణాలలో సమిష్టి భూస్వామ్య పద్ధతి మీద నే గ్రామ సంఘ విధానమునకు ప్రతిగా అసభ్యముగా అనుకరించారు. (మార్క్సుదాస్ కేపిటల్ 3 వాల్యూం 392-వ పుట).

## జమీందారుల పుట్టు పూర్వోత్తరాలు

నేడు తాసీల్దారు ఎలా సిస్తు వసూలు చేస్తున్నాడో అలాగే మహమ్మదీయ పరిపాలనకు పూర్వము 'చౌదరి' అనబడు నతడు హిందూ రాజుల కాలములో శిస్తు వసూలు చేసెడివాడు. మహమ్మదీయులు దానినే "క్రోరి" అనిరి. ఎందువల్లనంటె ఒక జిల్లాలోని భూములు కొన్ని భాగములుగా చేయబడెను. ప్రతి భాగము 2½ లక్షల రూపాయలు రాబడి యిచ్చునదిగా నుండెను. ఒక్కొక్క భాగముమీద అధికారము చెలాయించువానికి "క్రోరీ" అని పిలిచిరి. కాని మహమ్మదీయ రాజుల పరిపాలనలోని ఆఖరు రోజులలో ఈ "క్రోరీ" లు జమీందారీ లైనవి. జమీందారు అను పదము వాడుకనుబట్టియే వీరికి భూమియందు హక్కున్నదను అపోహకు కారణమయ్యెను—(జమీన్ రైతు 5-11-37)

జమీందార్లకు భూమియందెంతమాత్రము హక్కు లేనట్లీ క్రింది ప్రమాణములు నిర్ధారణ చేయుచున్నవి.

మద్రాసు ఎస్టేటు బిల్లును 1905 సం॥ న ప్రవేశపెట్టుచు రివిన్యూ మెంబరగు ఫోర్బ్సుగారు జమీందారులు పన్నులు వసూలు చేయుటకొరకే నియమింపబడిరని స్పష్టముగా నిట్లు తెల్పియుండిరి.

"The legal status of the Zamindar under the permanent settlement cannot be put higher than that of an assignee of public revenue."

No doubt the Mohammadan rulers found it expedient and advantageous to employ members of the anicient Hindu families who had established themselves in the country to undertake the duties of collection and act as their receivers general, but they never accorded to them any legal rights beyond, and the whole history of the times is a history of perpetual changes among the Zamindars. Old Zamindars were removed and new Zamindars were appointed. Again old Zamindars restored; and in the distractions of the times, the strongest and the most acceptable survived."

The Zamindar was continued by the settlement as an assignee or farmer of the public revenue as he had always been only on a different basis.

పై ఆంగ్లమునకు సారాంశమేమన శాశ్వత పైసలాయతి ప్రకారము జమీందారు హోదా ప్రభుత్వము వారి శిస్తు వసూలుచేయు ఉద్యోగికంటె హెచ్చు ఏ మాత్రము కాదు. ఇదివరలో శిస్తు వసూలు చేయు హిందూ ఉద్యోగులనే ఆ పనియందుంచుట అన్ని విధములా మంచిదని మహమ్మదీయులును తలచిరి. వారు వుద్యోగులకు భూమియందట్టి హక్కును యిచ్చియుండలేదు. వారి కాలములో ప్రాతవారిని తీసివేయుచుండిరి. కొత్తవారిని వేయుచుండిరి. అవసరమును బట్టి మరల ఆ పాతవారినే ఏర్పాటుచేసియుండిరి.

భిన్న కాలములలో వున్న రీతినే పర్మనెంటు సెటిల్మెంటు రీత్యా కూడా జమీందారు ఆ విధముగ పన్ను వసూలు చేయువాడుగనే పరిగణింప బడుచున్నాడు. పై సంగతి సందర్భములను బట్టి జమీందారు వుద్యోగస్తుడేగాని భూకామందు కాజాలడని స్పష్టపడినది గదా!

ఈస్టిండియా కంపెనీవారు 17వ శతాబ్దమున మన దేశమునకు వర్తకమునకై వచ్చి తర్వాత ప్రభువులైన సంగతి లోకవిదితము. వారు తమ స్వాధీనమైన దేశమందు శిస్తు వసూళ్లు నేడు ఆబ్కారీ దుకాణములను వేలం వేసినట్లు వేలం వేసెడి వారు. ఆ వేలంలో హెచ్చుపాట పాడినవారు, ఆయా ఖండములలో రైతులనుండి శిస్తు అధికముగా వసూలుచేసి బాధించుటయు ఒక్కొక్కప్పుడు ప్రభుత్వమునకు ఎగ బెట్టుటయు తటస్థించుచుండెను.

అందుచే విదేశీయులగు వీరికి ఈ దేశములో అండదండగ నుండుటకు పలుకుబడిగల వారికి కొంత భూభాగము సర్వ హక్కులతో స్వల్ప శిస్తుతో శాశ్వితముగ నిచ్చిరి. ఈ విధానము మొట్ట మొదట ప్రవేశ పెట్టిన కారన్‌వాలీసు ప్రభువు కూడా యింగ్లాండు నందొక జమీందారు. ఈ విధముగా అధికారము లేనివారికి అక్రమముగ ఆంగ్లేయులు భూమియందు అధికారము మొట్ట మొదట బెంగాలు రాష్ట్రములో కలుగ జేసిరి. అనంతరము ఈ విధానము అన్ని రాష్ట్రములకు వ్యాపించినది.

ఎవరీ జమీందారులు? వీరు నిజముగ భూస్వాములు కారు. వ్యవసాయకు లంతకంటెను గారు. వీరు వెనుకటి రాజుల సంతతి వారనుకొనుట కేవలము పొరపాటు. జమీందారులు చాలా వరకు వట్టి యిజారాదారులు. ప్రభుత్వము వారికి గ్రామములో రైతులనుండి రావలశిన సిస్తులను వసూలుచేసి పెట్టుటకు నియమింపబడిన తహసీల్ దారువంటి అధికారులు. జీత బత్తెములులేకుండ, వీరి శ్రమకు ప్రతిఫలముగ శిస్తులలో ఒక వాటాను వీరికిని, మిగిలిన రెండు వాటాలు

సర్కారుకును చెందునట్లు నిర్ణయింపబడినది. దానురాను ఈ కంట్రాక్టు దారులు వారసత్వపు హక్కులనే గాక, తాము సర్కారుకు చెల్లించ వలశిన రెండు వాటాలను ఆనాటి రాబడిని బట్టి శాశ్వితపు సెటిల్మెంటుగ నిర్ణయించుకొనిరి. సర్కారును వీరితోడ్పాటు నిమిత్తము ఈ నష్టపు కంట్రాక్టుకు లోబడిరి. ఇప్పుడీ జమీందార్లకు వచ్చు రాబడి వారు చెల్లించు పేష్కషుకంటె ఎన్నియో రెట్లు వృద్ధి చెందిన మాట యధార్థము. జమీల రాబడి ఎన్నియో రెట్లధికమైనను వారు సర్కారుకు చెల్లించవలశిన పేష్కష్ శిలాక్షరమువలె అట్టే నిలచియున్నది. యిదేటి న్యాయమని ప్రశ్నించినచో తాతల నాటి ఖరారునామాలను మార్చుటకు వీలులేదని ప్రభుత్వము వారు సమాధానము చెప్పెదరు. (కృష్ణాపత్రిక 12-9-36).

## పర్మనెంటు సెటిల్మెంటుకు కారణములు.

బంగాళా దేశములో శిస్తులు సక్రమముగా చెల్లకపోవుటచే ఏ పద్ధతి అవలంబించిన బాగుగనుండునో విచారించవలశినదని అప్పటికి ఈస్టిండియా కంపెనీకి గవర్నరు జనరలుగానున్న కారను వాలీసు ప్రభువు సర్ జాన్ షోర్ అను వానిని నియమించెను.

అతడు నాల్గు సం॥ విచారించి 1789 సం॥ లో ఒక రిపోర్టును వ్రాసెను. అందు అతను మూడు పద్ధతులను సూచించెను. (1) ప్రతి రైతుతోను నేరుగా పైసలాయితీ చేసుకొనుట (2) భూములను శిస్తుకు వేలంవేసి సదరు పాటదార్లతో సెటిల్మెంటు చేసుకొనుట (3) పూర్వమునుండి వున్న జమీందారులతో సెటిల్మెంటు చేసుకొనుట. ఈ మూడవదే అన్ని విధముల వుత్తమమైన మార్గమని అతడు వ్రాసెను.

దానినే కారన్ వాలీసు ప్రభువు అమలు నందుంచెను. సర్ జాన్ షోరు జమీందారుతో పేష్కషు నిర్ణయించుకొనుటతో పాటు రైతు

యొక్క హక్కులుకూడా నిర్ణయింపబడవలెనని స్పష్టపరచెను. దానిని గమనించక కారన్‌వాలీసు తన రాజ్య రక్షణకు జమీందారులతో మాత్రమే పర్మనెంటు సెటిల్మెంటు గావించుకొని రైతు హక్కులను త్రోసి పుచ్చెను.

1 కారన్‌వాలీసు ప్రభువు జమీంధారగుటయు 2 అతడు వచ్చు సరికి, జమీందారులే శిస్తు వసూలు చేయువారుగను పలుకుబడి గలవారుగ వుండుటచే, వారిని తొలగించి మరియొకరిని నియమించుట ప్రమాదమని యెంచుటవల్లను, 3 భూమియందు వారికి సర్వ హక్కులు కలుగజేసిన ప్రభుత్వమునకు అండదండగ నుందురని యెంచుట, 4 పాటదార్లనుండి రైతులను రక్షించవలెనని యెంచుటయు, పర్మనెంటు సెటిల్మెంటుకు కారణములు.

నాల్గవ కారణము మాత్రము నాటికి నేటికి నిలచియున్నది. నాటి పాటదార్లకంటె నేటి జమీందార్ల బాధలు రైతుల పాలిట దుర్భరములైనవి. అతడు తలచినట్లు నేటికిని ప్రభుత్వము సెడల జమీందారీ బృందము భక్తి కల్గి వారికి అండ దండగ వుంటూ ప్రజాశక్తిని నిరోధించు చున్న సంగతి లోక విదితముగదా!

## పర్మనెంటు సెటిల్మెంటు పద్ధతి

బెంగాలులో 1793 సం॥ లోను మద్రాసు రాష్ట్రములో 1802 లోను, వివిధ రాష్ట్రములలో వీలువెంట పర్మనెంటు సెటిల్మెంటు చేయబడెను. జమీందారులకు ఈ క్రింది నిబంధనల ననుసరించి శాశ్వతపు పద్ధతులను ఏర్పరచిరి—

(1) జమీంధారు లందరు రాజభక్తిని కలిగియుండవలెను.

(2) వీరికి గల సివిల్, క్రిమినల్, మిలిటరీ హోదాలు వదలుకొనవలెను.

(3) గ్రామములలో యిండ్ల పన్ను, ఆదాయపు పన్ను, రహదారీ పన్నులను వీరు వసూలుచేయరాదు. భూమిపన్ను మాత్రమే వసూలుచేయుటకు వీరికి హక్కుగలదు.

(4) (అ) బెంగాలులో నికరాదాయములో నూటికి 90 వంతులు ప్రభుత్వమున కిచ్చుటకును, పది వంతులు మాత్రమే జమీందారు తీసుకొనుటకును శిస్తు శాశ్వితముగా స్థిర పరుపబడెను.

(ఆ) మద్రాసు రాజధానిలో ఆదాయములో సగము రైతునకు చెందునట్లునూ, మిగతా సగములో 3 భాగములు చేసి రెండు భాగములు ప్రభుత్వమును, శిస్తు వసూలు గావించినందుకు జమీందారులొక భాగము తీసుకొనునట్లుగాను శిస్తు శాశ్వితపరచబడెను.

(5) అప్పటికి గ్రామములోని బంజరు, పోరంబోకు భూమి అంతయు సాగులోనికి తెచ్చుకొని జమీందారులు అందలి ఫలమును గవర్నమెంటున కేమి యివ్వక తామే అనుభవించవచ్చును.

(6) అప్పటికివున్న ధర్మ చెరువులు, మంద బయళ్లు, కళ్లములు, రుద్రభూములు, పుంతలు మున్నగు సాముదాయక భూములలో జమీందారుల కెట్టి హక్కులేదు.

(7) జమీందారునకు ఎస్టేటు అమ్ముకొనుటకు, అన్యాక్రాంతము చేయుటకు అధికారమీయబడెను.

ఈ యేడు షరతులుగాక ప్రభుత్వమువారు యీ దిగువ ప్రమాణమునుగూడా చేయించుకొని వారికి (జమీందార్లకు) సనదు లిచ్చిరి.

"ఎంతకాలము రైతుక్షేమమే నా క్షేమముగా నెంచుకొందునో అంతకాలము ఈ శాశ్వతపు పన్ను పద్ధతియొక్క లాభమును నేను పొందగల్గుదును"

ఈ ప్రమాణములోని శతాంశము కూడా ఆచరణలో నుంచని జమీందారీలను ఏల రద్దు చేయరాదు? ఇందసత్యదోషము గాని, అన్యాయముగాని, ఒడంబడికకు భిన్నముగాని లేదుగదా!

## వివిధ ప్రాంతముల జమీందారులు

జమీందారు శబ్దము ఆంగ్లేయులకు పూర్వమునుంచి వున్నప్పటికీ నేడు యీ శబ్దము మన హిందూదేశములోని వివిధ ప్రాంతముల యెటుల వాడబడుచున్నదో తెలిపెద.

### బెంగాలు—మద్రాసు

కొంత భూమి నాక్రమించుకొని, దానిని ఇతరులకు వ్యవసాయమునకిచ్చి, ఆధిపత్యము తనయందుంచుకొని, వారివద్దనుండి, ధాన్యరూపముననో, ధనరూపముననో వసూలు చేసుకొనుచు ఉదరపోషణ చేసుకొంటున్నవారు జమీందారులని పిలవబడుచున్నారు.

### పశ్చిమోత్తర పరగణాలు—పంజాబు

గ్రామ గుడికట్టు భూమియందు వ్యష్టిగాగాని, సమిష్టిగాగాని, సర్వస్వామ్యములు సంక్రమింప జేసుకొని ప్రత్యేక సిద్ధాంతముల నాదర్శముగా నుంచుకొని, అనుశ్రుతాచారమునుబట్టి, తమలో తాము విభజించుకొని, అందలి ఫలసాయమును యథేచ్ఛగా అనుభవించే గ్రామ సంఘములవారిని కూడా జమీందారులనుట కలదు.

### సింధు—పంజాబు

కొన్ని జాతుల నాయకులు అందుబాటైనంతవరకు భూమి నాక్రమించుకొని, సాధ్యమైనంతవరకు స్వంతముగా సేద్యము చేసికొనుచు,

శేషించిన దానిని పాయికారి రైతులకు అమరకమున కిచ్చి, వారివద్ద నుండి పన్ను బందలను వసూలుచేసుకొనువా రొకరకపు జమీందారులు. వీరు పంజాబులో కొంత భాగములోను, సింధు దేశము నందంతటను కలరు.

## మధ్య రాష్ట్రములు

బంజరు భూములను వ్యవసాయమునకు లాయకుగాచేయు సమర్థత గల పలుకుబడిగల వారికి పెద్దపెద్ద భూఖండములను వశపర్చి వీరిని జమీందారులనిరి.

## సంయుక్త రాష్ట్రములు—అయోధ్య

ప్రభుత్వమువారి ఏర్పాటు ప్రకారము శిస్తు వసూలుచేయుటకు నియమింపబడినవారు జమీందారులని పిలువబడుచున్నారు.

మహారాష్ట్రము (బొంబాయి రాజధాని) గ్రామాధికారులు వసూలు చేసిన శిస్తును వారి వద్దనుంచి వసూలుచేసి సర్కారు ఖజానాలో జమ కట్టుటకు ఏర్పాటైన ఉద్యోగిని జమీందారందురు.

ఈ విధముగ మన హిందూదేశమున జమీందారను శబ్దము వివిధ రీతుల వాడబడుచున్నది. ప్రభుత్వమువారే దీనిని నిర్వచించకుండా యీ విధముగ వాడుచున్నారు.

## జమీందారీలంటే ?

జమీందారుల సంగతి తెలిసినదికద! ఇక జమీందారీలంటే ఏమిటో తెలుసుకొందాము.

పురాతన జమీలు, కొత్తగా కల్పింపబడిన జమీలు, యెస్టేట్లు, ఆక్షనుఫామ్ ప్రొప్రయిటరీలు, జాగీరులు, ఈనాములు, మొఖాసాలు, ముఠాలు, జమీలు, వేస్టులాండు విశేషజన్స ~~ఇనిస్యా~~ అను యిత్యాది వివిధరకములు.

నేడు మనం జమీందారీ పద్ధతి రద్దు కావాలనటము ప్రభుత్వము నకును రైతులకును మధ్యను నడిమంత్రముగ వచ్చినవన్నీ నాశనము కావలెననే.

## జమీందారీ పద్ధతి విస్తరణ

నాడు కారన్‌వాలీస్ ప్రభువు ఏర్పరచిన జమీందారీ విధానము నేడు మహారాష్ట్రమున తప్ప మహామారిలాగా మన దేశమునం దంతటను వ్యాపించినది. మన దేశములో ఏడు లక్షలు గ్రామాలుంటే, ఈ జమీందారులు ఎనిమిది లక్షలున్నారు. దీనికి కారణము మన మద్రాసువలె అవిభాజ్యపు శాసనము లేకపోవుటే గాక మహల్వారీ పైసలాతీ ప్రకారము పెక్కుమంది కుక్క గొడుగులులాగా వెలశారు.

## జమీందార్ల ఆదాయము

మన ఇండియాలో పర్మనెంటు సెటిల్మెంటని, టెంపరెరి సెటిల్‌మెంటని, జమీందారీ పద్ధతి రెండు విధాలుగా వున్నది. ఫర్మనెంటు సెటిల్‌మెంటుకంటె టెంపరెరి సెటిల్‌మెంటులో పన్నుల భారము జాస్తి.

వివిధ రాష్ట్రములలో పర్మనెంటు సెటిల్‌మెంటు భూములపై జమీందారులు ప్రభుత్వమునకు చెల్లించు మొత్తం రు. 4,63,81,517 రూపాయలు. జమీందారులు రైతులనుండి నాలుగు రెట్లు హెచ్చు వసూలు చేయుచున్నారు గాన ఆ మొత్తము రు. 18,55,26,068 లు అగును.

టెంపరరి సెటిల్‌మెంటు పద్ధతిపై జమీందారులు రు. 14,26,33,000 లు పేష్కషు చెల్లించుచున్నారు. వీరు రైతుల నుండి మూడు రెట్లు హెచ్చు గుంజుచున్నారు. కాన ఈ మొత్తము

రు. 42,78,99,000 లు అగుచున్నది. మొత్తముమీద ఈ జమీందారులు రైతుల రక్తనాళములనుండి రు. 61,34,25,000 లు పీల్చు చున్నారు.

రైత్వారీ రైతులు దాదాపు సగ భాగమున రు. 30, 85, 79,422 లు మాత్రము చెల్లించుచున్నారు. సారాంశమేమన జమీందారులు మొత్తంమీద రైతులనుండి రెట్టింపు గుంజుతున్నారు. ఇది ప్రభుత్వ లెఖ్ఖలనుబట్టి తేలినదే. (Agricultural Statastics 1932—33).

ఇంకను అడవుల ఆదాయము, ఇతర రుసుములు మొదలగునవి చేర్చినచో మరిపది కోట్లకు పైబడును. వీరు 18 కోట్లు ప్రభుత్వమున కిచ్చుచు, దానికి నాలుగు రెట్లు రైతులనుండి వసూలు చేయుట మహా ఘోరము. ఈ అధిక శిస్తునకు కారణము, వీరుకట్టిన ఆనకట్టలు కావు; నూతన పద్ధతులు ప్రోత్సహించుటవల్లనూ కాదు. నా నాటికి రైతులను నాశనము చేయచు అధికంగా వసూలు చేయుట తప్ప మరొకటికాదు.

## మన మద్రాసు జమీందార్ల ముడుపు

మనరాజధానిలో 1802 లో పర్మనెంటు పద్ధతి ఏర్పాటయ్యెను. నేడు రాజధానిలో మూడింట రెండు వంతులు ప్రభుత్వమువారిక్రిందను, మూడవవంతు జమీందారులక్రిందనుకలదు. రైత్వారీ రైతులు చెల్లించునది రు. 5,02,57,382 లు. వారికి ప్రభుత్వము ప్రాజెక్టులను, జలాశయములను ఏర్పరచినది. వారికి రిమీషను హక్కుకూడా కలదు. కరువు నివారణకు రక్షణకలదు.

ఈ సౌకర్యములు ఏమీచేయక, ఎండినా, మురిగినా, ఏటేట వెంకటేశ్వర్ల ముడుపు లాగ జమీందారీరైతులు చెల్లించునది రు. 2,51,05,400లు. ఇదిగాక 50 లక్షల రూపాయలు అడవులమీద, యిజారాద్వారా, స్వంత కమతములవల్ల రాగలదు.

ఈ మూడుకోట్ల ముడుపులో మొట్టమొదట మన రాష్ట్రంలో శాశ్విత పైసలాయితీ జరిగినపుడు రైతులనుండి వసూలయ్యేడిది రు. 75 లక్షలుమాత్రమే. అందు 50 లక్షలు ప్రభుత్వమునకు యిచ్చునట్లుగను, వసూలుచేసినందుకు రు. 25 లక్షలు జమీందారులకు ప్రతిఫలముగ వదలివేయబడెను నాటినుండి నేటివరకు జమీందారులు చెల్లించునది 50 లక్షలు మాత్రమే. కాని వారు పొందవలసిన 25 లక్షలకుగాను నేడు పది రెట్లు అదనంగా రైతుల నోటమట్టికొట్టి పొందుచున్నారు గాని, వీరేమి నూతనపద్ధతుల నెలకొల్పిగాని, వ్యవసాయవసతులను కలిగించిగాని పొందుటలేదు.

మన రాజధానిలో జమీందారులు హిందూదేశములోని ఇతర జమీందారులకంటె అధికంగా అనేక రెట్లు వసూలు చేయుచున్నారు.

ఎండ వాన అనక, రాత్రిపగలు అనక, జర్రిపాము అనక, గడ్డకు పుట్టెడునీళ్లుతాగి కష్టపడి పండించిన రైతుఫలితమును, జమీందారులు పర్మనెంటు పద్ధతిఫలితంగా అన్యాయముగా దోచుకొంటున్నారు.

నిద్రమేల్కొనరా తమ్ముడా గాఢనిద్రమేల్కొనరాతమ్ముడా!
నిద్రమేల్కొని భద్రవడర ఓ జమీందారీ రైతుతమ్ముడా!

రాజ్యమునకు రైతుగుండెరా
సామ్రాజ్యమునకు రైతురక్షరా
అట్టిరైతు మేడిబట్టకున్నరా
యీరాజ్యమంతా పూజ్యంబురా
యీదహన్యంబు గనబోరురా॥ నిద్రమేల్కొనరా॥

కొసరాజు రాఘవయ్య చౌదరి,

# మద్రాసు రాజధాని జమీందారీలు

మన రాజధానిలో షుమారు 16,000 జమీందారీలు కలవు. శాశ్వత పైసలాయితీ ప్రకారము రెండువంతులు ప్రభుత్వమునకు, ఒక వంతు జమీందారులకు భాగములు. నేటి పేష్కషు, ఆదాయములు, కొన్ని జమీందారీలవి ఉదహరిస్తున్నాను.

| జమీందారీ పేరు | పేష్కషు | ఆదాయము |
|---|---|---|
| | రూపాయలు | రూపాయలు |
| విజయనగరము | 4,66,464 | 20,90,394 |
| వెంకటగిరి | 3,68,734 | 14,46,222 |
| పిఠాపురము | 2,31,438 | 8,02,721 |
| బొబ్బిలి | 83,442 | 8,33,000 |
| కాళహస్తి | 2,53,451 | 5,82,550 |
| శివగంగ | 2,92,627 | 6,76,397 |
| చల్లపల్లి | 78,076 | 3,51,230 |
| రామ్నాడు | 77,985 | 11,69,705 |
| కోలంక, వీరవరం | 31,030 | 1,43,647 |
| మునగాల | 4,008 | 1,20,000 |
| ముక్త్యాల | 17,511 | 78,882 |
| కపిలేశ్వరపురం | 8,523 | 75,335 |
| తేలప్రోలు | 12,841 | 83,021 |
| గొల్లపల్లి | 3,199 | 25,714 |
| మీర్జాపురం | 11,446 | 1,79,283 |
| ఎలమర్రు | 15,330 | 1,91,878 |
| జగ్గంపేట | 22,234 | 1,03,698 |

| | | |
|---|---|---|
| శిరిపురము | 23,600 | 98,414 |
| మందసా | 12,861 | 2,76,058 |
| సాలూరు | 27,263 | 1,69,653 |
| కురుపాం | 14,145 | 1,28,912 |
| మాడుగల | 28,784 | 2,25,794 |
| చీకటి | 33,143 | 3,40,187 |
| పోలవరం | 10,855 | 72,065 |

## మన ఆంధ్ర జమీందారీలు

మన ఆంధ్ర జిల్లాలు 11 లోను దత్తమండలములగు బళ్లారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలలో జమీందారులు లేనేలేరు. ఇక్కడ రైత్వారిపద్ధతే అమలులో వున్నది. జమీందారుల పీడ లేక పోయినా, జలాశయములు లేకపోవుటచే కొటకము వారిని వదలుటలేదు. ఇక మిగిలిన ఏడు జిల్లాలలోను జమీందార్ల సంఖ్య, వారి పేష్కషు, ఆదాయములు.

| | జిల్లా | సంఖ్య | పేష్కషు రూపాయలు | ఆదాయము రూపాయలు |
|---|---|---|---|---|
| 1 | విశాఖపట్నం | 89 | 9,04,454 | 54,23,783 |
| 2 | తూర్పుగోదావరి | 74 | 5,39,150 | 23,00,000 |
| 3 | పశ్చిమగోదావరి | 74 | 2,01,470 | 7,65,310 |
| 4 | కృష్ణా | 107 | 2,46,180 | 18,26,136 |
| 5 | గుంటూరు | 1 | 44,928 | 1,55,428 |
| 6 | నెల్లూరు | 35 | 4,06,881 | 16,03,587 |
| 7 | చిత్తూరు | 183 | 3,32,675 | 18,50,236 |
| | | 563 | 26,75,738 | 139,24,480 |

మన తెలుగు జమీందార్లు రైతులనుండి క్రమక్రమంగా సిస్తు ఎలా హెచ్చిస్తున్నారో చూడండి.

| | సంవత్సరము | పేష్కషు | ఆదాయము |
|---|---|---|---|
| | | రూపాయలు | రూపాయలు |
| మునగాల. | 1802 | 4,008 | 6,012 |
| | 1908 | ,, | 46,000 |
| | 1933 | ,, | 1,30,000 |
| | నేటికి | ,, | ? ? ? ? |
| ముక్త్యాల | 1802 | 17,511 | 26,266 |
| | 1936 | ,, | 78,882 |
| పిఠాపురం | 1802 | 2,58,979 | 3,92,182 |
| | 1874 | ,, | 5,51,231 |
| | 1936 | 2,31,438 | 8,02,771 |
| విజయనగరం | 1802 | 4,66,464 | 7,00,000 |
| | 1845 | ,, | 8,27,100 |
| | 1846 | ,, | 10,00,000 |
| | 1904 | ,, | 16,00,000 |
| | 1937 | ,, | 24,00,000 |

ఈ పెంపుదలకు ఒక నీతీ రీతీ వుందా? అన్యాయం! అన్యాయం! పెరుగుట విరుగుట కొరకే అన్న పెద్దలు సుద్దుల సంగతి శుద్ధ అబద్ధమగునా ?

## పన్నులా—పబ్లిక్ దోపిడీలా ?

తెలుగు జమీందారులు రైతులనుండి పన్నులు ఎంత దారుణంగా వసూలుచేస్తున్నారో గమనించండి.

విజయనగరం ఎస్టేటులో, యకరం 1-కి మెరకకు రు. 10-0-0 లు, పల్లమునకు రు. 18-0-0 లు. బొబ్బిలిలో, మెరకకు యకరం 1-కి రు. 2-0-0 లు మొదలు రు. 5-0-0 లు, పల్లమునకు రు. 11-0-0 లు మొదలు రు. 35-0-0 లు వరకు కలదు. యకరాకు రు. 35-0-0 లు చొప్పున పదివేల యకరాలకు వసూలుచేస్తున్నారు, పల్లపు పేరుతో. పిఠాపురం యెస్టేటులో, మెట్ట యకరం 1-కి రు. 5-0-0 లు, మొదలు రు. 10-0-0. పల్లానికి రు. 30-0-0 లు యకరాకు. అనకాపల్లి ఎస్టేటు పల్లపుసాగు యకరం 1-కి రు. 10-0-0 లు మొదలు రు. 35-0-0 లు. పర్లాకిమిడి మెరక రు. 4-0-0 లు, పల్లం రు. 14-0-0 లు. కసింకోట మెరక రు. 2-0-0 లు మొదలు రు. 6-0-0 లు, పల్లం రు. 8-2-0. మునగాల మెరక రు. 4-0-0 లు, పల్లము రు. 18-0-0 లు. తిరుపతి పల్లం యకరం 1-కి రు. 40-0-0 లు. ఈ ఎస్టేటులో యకరాకు రు. 120-0-0 లు కూడా కలదు. ఏడుకొండల వాడికి నిలువుదోపిడి నిత్యకృత్యమేగా!

వెంకటగిరి ఎస్టేటు కనిగిరి తాలూకాలో, మెట్ట గొర్రు 1-కి రు. 2-0-0 లు మొదలు రు. 12-0-0 లు, మాగాణి రు. 20-0-0 లు మొదలు రు. 80-0-0 లు, తోటలు రు. 24-0-0 లు మొదలు, రు. 80-0-0 లు వరకు.

ఈ విధంగా అంతులేని పన్నులు అక్రమంగా రైతులనుండి లాగుతున్నారు.

పార్వతీపురము తాలూకు పెద్దబొండపల్లి శిస్తు 1933 లో రు. 6,000 లు. బొబ్బిలి ఎస్టేటులో చేరగానే రు. 12,000 అయింది. రైతులకొరకు యీనాము ఆక్టు పెట్టిన బొబ్బిలిదొరగారి కృప ద్విగుణీకృతమయింది. వెంకటగిరి ఎస్టేటు, పెళ్లూరుతాలూకా, పెళ్లూరుకు పర్మనెంటు సెటిల్‌మెంటు కాలమున పన్ను రు. 2,160-8-9 లు. మరిప్పుడో రు. 12,446-1-0 లు.

మా కొద్దీ జమీందార్ల పొందు మాప్రాణాలపై పొంచి
మానాలు హరియించె ॥మాకొద్దు॥
ఎకరాకు డెబ్బది యెన్నాళ్లు బ్రతికేము
సకలము గుంజేసినారు మమ్మి వికలాంగులను జేసినారు
కొంప లకట గుల్లలు జేసినారు
యిక మాకు దిక్కెవరు యీ బాధ పడలేము ॥మా॥

నెల్లూరి వెంకట్రామా నాయుడు.

## తెల్ల దొరతనము—నల్ల దొరతనము.

జమీందారీలలో ఎంత ఘోరముగా పన్నులు వసులుచేస్తున్నారో పరికించారు కద! ఇకను ఆయా జమీందారీలలోని రేట్లను, ప్రక్కనున్న ప్రభుత్వము వారిరేట్లతో పోల్చి చూపిస్తాను

| జమీందారీ | ప్రభుత్వము |
| --- | --- |
| వెంకటగిరి యెస్టేటు గురవారెడ్డి పాలెంలో సజ్జ, రాగి, వేసిన భూములకు గొర్రు 1కి రు. 64-0-0లు (గొర్రు అంటే య. 3-12) | ప్రక్కనున్న బుడ్డాయి పల్లె తోట గ్రామంలో, అదే పైరు పరిమాణములకు రు. 3-0-0 లే |
| బొబ్బిలి యెస్టేటు వావాం గ్రామంలో హెచ్చు పల్లపు రేటు య 1కి రు. 60-0-0లు. | ప్రక్క ఫర్లాంగు దూరములోని, బూర్జగ్రామంలో హెచ్చు పల్లపు రేటు య 1కి రు. 12-0-0లు. |

| జమీందారీ | ప్రభుత్వము |
| --- | --- |
| కనిగిరి తాలూకా పామూరు యెస్టేటు దర్శి కుంట్ల పేటలో మాగాని య. 1కి రు. 40-0-0 మెట్ట రు. 14-0-0 లు. | ప్రక్కనున్న గవర్నమెంటు రేటు మాగాని య 1కి రు. 7-0-0 లు. మెట్ట రు. 2-0-0లు. |

ఈ యెస్టేటు పోరంబోక మాగాని య. 1కి రు. 80-0-0ల వరకు కూడా కలదు! వింటుంటేనే గుండెలు పగిలి పోతున్నవి; చెల్లించే రైతుకడుపు చెరువైపోదా? మా కొద్దీ తెల్ల దొరతనము అంటారే గవర్నమెంటు గ్రామాలవారు; మా కొద్దీ నల్లదొరతనము అని మేము అనాలో; మా నోళ్లు నొక్కుతారా దేశ భక్తులు! స్వరాజ్యం వచ్చేవరకు మమ్ముల మూగనోము పట్టమంటారా? మీరు కూడా పట్టు పట్టి పగడ బందిగా జమీందారీ రైతులకు సహాయము చేస్తారా?

పన్నుల భారము పడ లేము తండ్రి
కన్నుల నీ రొలుకుతాయి మా
కష్టాలు వేనవేలోయి చెపితే
విని సహించగ లేరోయి
సర్కార్ గ్రామాలకైన సాగిపోతాము గాని
మా కొద్దీ జమీందార్ల పొందు.॥

## జమీందారీలు—జబరదస్తీలు

ముక్త్యాల జమీందారుగారు పట్టా ట్రాన్సుఫరులకు ప్రభుత్వము రు రిజస్ట్రేషన్‌కు తీసుకొన్నట్టుగనే నజరానాలు తీసుకొంటారు.

వడ్డీ రు. 1-0-0 చొప్పున వసూలు చేస్తారు. విద్యాపన్నంతా రైతుల నుండి లాగుతారు.

చల్లపల్లి రాజాగారు ఖేరీజులనె అక్రమపు రుసుము అమాయక రైతాంగము నుండి చల్లగానే పుచ్చుకొంటారు. ఈ యెస్టేటులో ల్యాండు ఆక్టుకు పూర్వం గీశేతాళ్లకు సిస్తు మామూలువున్నది. సహజంగా తాళ్లు సంవత్సరాల తరబడిని తగ్గుతవి కదండి! ఇక్కడ తాళ్లు తరిగినా పన్ను పెరుగుతుంది. చల్లపల్లి సంస్థానం చల్లని సంస్థానమన్నమాట వట్టి మాటా?

గంపల గూడెములో మహసూల్ దారీ, మజుందారీ అనే రెండు అక్రమపు సెస్సులు వసూలు చేయబడుచున్నవి. యలమంచిలి యెస్టేటులో ఆనకట్ట కట్టిన తర్వాత మామూలు పల్లమైనా, పల్లపు రేటు అదనంగా వసూలు చేస్తున్నారు! కృష్ణాజిల్లాలోని మీర్జాపురం, లక్ష్మీ నర్సాపురం జమీందార్లు సరిహద్దు గ్రామాల్లో ఒకె భూమికి శిస్తు వసూలు చేస్తారు! పిఠాపురం యెస్టేటులో పల్లపు మంజూరు సాగుకు గూడా అదనపు శిస్తువసూలు చేస్తారు, ఆంధ్రభాషా పోషణకో! అనాధశరణాలయంకో! తిరుపతి దేవస్థానములో పన్నులకే దుంప తెగుతుంటే పైగా 'దేవతారుసుం', 'నౌకరీరుసుం' వగైరా అక్రమ సెస్సులు వసూలు చేస్తున్నారు.

తేలప్రోలు యెస్టేటుతో శేరీలలో ఇళ్లుకట్టుకుంటే అధికంగా పన్నులు వసూలు చేస్తారు.

1936లో జవహరిలాలుగారు బొబ్బిలి వస్తే సభ జరుగకుండా అనేక అల్లరులు చేసిన సంగతి అందరికి తెలిసిన సంగతే గద! గంపల గూడెం యెస్టేటువారు, కొల్లిబుచ్చయ్యగారు జమీందారీ కమిటి ఎదుట సాక్ష్యమిచ్చి నందులకు, సున్నంలోకి ఎముకలేకుండా విరగ గొట్టిన సంగతి వేరే చెప్పాలి?

సెన్సారు బోర్డువారి వల్ల అంగీకరించ బడ్డ 'రైతు బిడ్డ' ఫిలిం జమీందారీ రాజ్యములో అడుగు పెట్ట నివ్వకుండా చేయించిన జమీందారీ జబరదస్తీ జన్మలో మరువగలమా?

నదీ ప్రవాహముచే లంక భూములు కొయ్యకుండా రివర్టుమెంటు గాని, రెల్లుగాని, నాటి ఈ జమీందారీ ప్రభువులు భూమి నదీ పాలం కాకుండా చెయ్యరు. లంక భూములు కొట్టుకుపోయినా రైతులు సిస్తు యిచ్చుకోవాలి చచ్చినట్టు. కొట్టుకుపోయి కొత్తలంకలు ఏర్పడితే జమీందారుగారివే! ఇది జమీందారీ న్యాయం.

పట్టా ముచ్చిలకాలు జమీందారీ రాజ్యంలో ఎక్కడా సక్రమంగా లేవు. ఈ జబరదస్తీ జమీందారీ జగత్తంతటా వున్నది. దీనివల్ల పడేబాధ ఆరైతాంగానికి తప్ప అన్యులకు అర్థంకాదు. కొంపలు గూలుతున్నాయి! పర్లాకమిడి, సాలూరు, చింతలపూడి మునగాల మొదలగు యెస్టేట్లలో యింక వెట్టి చేయించుకొంటూనే వున్నారు. 1908 సం॥లో ్యాండు ఆక్టు ప్రకారం రైతు,ముచ్చిలికాచెట్లు జమీందారివే అని ప్పుకొంటే జమీందారివే. దరిమిలా చెట్లు రైతువే. రైతులు ఒప్పు ిన్నా ఒప్పుకొనక పోయినా చెట్లను తమ యిష్టము వచ్చినట్లు జమీం ార్లనేకులు స్వాధీన పరచుకొందురు. అందులో పిఠాపురపువారు ప్రథమ శ్రేణిలో వస్తారు; కోళ్ల ప్రదర్శనము నవచ్చినట్లే.

ఎన్నని వ్రాయుదు ఈ జబరదస్తీలు? కంబట్లో తింటూ వెంట్రుకలు ఏరినట్లు!

## అయోధ్య తాలూకాదారులు—అక్రమ వసూళ్లు.

సంయుక్త రాష్ట్రములలోను, అయోధ్యలోను టెంపరరి సెటిల్మెంటు కలదు. అక్కడ పన్ను వసూలు చేసేవారిని, తాలుకా దార్లని,

జమీందార్లని పిలుస్తారు. ఈ పన్ను వసూలుచేసే వారికి పట్టపగ్గాలు లేవు. అక్కడ అన్యాయాలను మన ఆంధ్రుడగు పాతూరి వేంకట శివరామ శర్మగారు (గుంటూరుజిల్లా, బాపట్ల) యావద్భారతము యాత్ర చేసి, తమ అనుభవాలు 'నాయాత్ర ' అనే గ్రంథంగా రచించిన దానిలోని ప్రస్తుతాంశములు:—

"అయోధ్యా రాజధాని లక్ష్మి రాజధాని. వన దేవతలు తాండవ మాడుచుండిరి. పాడి పంటలతో తులతూగు చున్నది. బైబులులో చెప్పిన యీడెను వనమా యను నటులున్నది. ఎటు చూచినను మామిడి వృక్షములు, ఫలవృక్షములు, పొలములు పచ్చని పంటల నిండియున్నవి. బహు ముఖముల దేశము నవ్వుచున్నది. రామ రాజ్యములో సంచరించు చున్నటు లుండెను. భూమి మిక్కిలి ఫలవంతమైనది. గోమతి, సరయూ మొదలగు నదులచే రాజ్యము తృప్తి చేయబడుచున్నది. చిత్ర మేమనగా; ఇట్టి మహా దృశ్యముల మధ్య శుష్కించిన కుగ్రామము లగ పడుట. యీ గ్రామములు చూచిన గుండె చెదరును. కొన్నిచోట్ల మొండిగోడలు, కొన్నిచోట్ల పడిన యిండ్లు, మరి కొన్నిచోట్ల కప్పుల మీద నాగజెముడు మొలిచి యుండుట. రైతులు బక్క చిక్కి యొండిపోయినట్లగపడిరి. దరిద్రము వారి మోముల వ్రేలాడు చుండెను. ఈ వింత అయోధ్య జమీందార్ల మహిమ యని నెంచితిని.

అయోధ్య రాజుయొక్క కోటకు వెళ్లితిమి. ఈయన ఒక జమీందారు. . . . కోటలో జమీందారు లేడు. అందులో ప్రవేశించి మేము కూర్చుంటిమి. బల్లమీద వార్తా పత్రికలు చదువుటకు వున్నవి. ఇంగ్లీషు వచ్చిన క్షత్రియ పెద్దమనిషి అక్కడుండెను. రాజుగారి బంధు కోటిలోని వాడుగా నగపడెను. వారితో సంభాష ణలో రైతుయొక్క దారిద్ర్యమును గురించి ముచ్చటించితిని. నా అభిప్రాయమును వారు అంగీకరించిరి. తాలూకాదార్లు రైతులను పిల్చి

వేయుదురని చెప్పెను. తాలూకాదారు వివాహము చేసినను, మేడకట్టి నను, మోటారుకారు కొనినను, అయా ఖర్చులు రైతులవద్ద శెస్సుల మాదిరిని వసూలు చేయుదురట. కనుక గ్రామములు దరిద్ర స్వరూప మునకును, రైతులయొక్క దుస్థితికిని. నాకు సమాధానము దొరికినది."

(నా యాత్ర 97—98—103 పుటలు)

ఇంక దీనిపై నా నీరస వ్యాఖ్యాన మెందుకు? రాజకీయోద్దేశ్యము లేని ఒక యాత్రికుడు, జమీందారుగారి బంధువుల నోటను చెవులార విన్న, కండ్లార చూచిన దానిని కాదనగలరా? హృదయము కలవాడె వడైనా యీ జమీందారీ పద్ధతి ఇంకా సాగిపోవాలనునా?

వేయేల? ఈ దారుణ స్థితిని గమనించియే సంయుక్త రాష్ట్రముల గవర్నరుగారు 1936 సంవత్సరమున గ్రామ పునరోద్ధారణకై ప్రయ త్నించవలసినదిగా చెప్పుచు, అయోధ్య తాలూకాదారులను ఇటుల హెచ్చరించె. "తాలూకాదారుల పద్ధతి భంగము కాకుండుటకు, రైతులయొక్క ప్రేమయే మూలాధారమను టెన్నడును మరువ జనదు."

ఈ హితవాక్యము, హెచ్చరిక, గాలికెగిరిపోయె. నా రైతు సోదరులు నాడూ, నేడూ యథాతథముగ పీడింపబడుచునే యున్నారు. ఎప్పుడు ఈ ముప్పు తొలగునది? ఈ జమీందారీ పూతనను హరించుటకు కృష్ణుడు పుట్టునది?

## జమీందారీ విధానము జన నాశనకరము

మన తెలుగు జమీందారులు, చుట్టు పట్ల ప్రభుత్వ గ్రామాల్లో కంటె ఎంతెంత అధికముగా శిస్తు వసూలు చేస్తున్నారో విశదపరచాను. ఇంతటితో తృప్తి చెందక అక్రమ శెస్సులుకూడా అదనంగా అమాయక రైతాంగంనుండి వసూలు చేస్తున్నారు. ఈ జాతి ఇక్కడే గాక,

ఎక్కడున్నా ఒక్కటే అని అయోధ్య తాలూకాదారుల అక్రమ వసూళ్ల వల్ల కూడ విదితమైనది. ఆరుకాలము కష్టపడి పండించిన ధాన్యరాసు లన్నీ జమీందారు లనేకవిధముల హరించుతూ రైతాంగాన్ని శల్యవతు చేశారు. అన్నీ పండించిన రైతుకు అన్నం కరువయ్యింది. ఆకలి బాధచే అనేకులు మరణించుచున్నారు. కొన వూపిరితో వున్నవారు ఏ వ్యాధి వచ్చినా, రోగాన్ని ప్రతిఘటించగల సహజ శక్తి, ఈ జమీందారీ రైతుల్లో లేక పోవుటచేత వెంటనే యీ లోకాన్ని విడుస్తున్నారు. ఈ జమీందారీ విధానమువల్ల జనులలో పూర్తిగా జవ సత్వములు నశించాయి. అందువల్ల అధికమరణములు కలిగి జన సంఖ్య ఈ ప్రదేశాలలో తగ్గుతున్నది. వాదనై పుణ్యంవల్ల, కవితా ప్రావీణ్య మువల్ల, కనుకట్టువల్ల, లోబరుచుకొని చెప్పేమాటలు కావునావి. ఈ అంకెలే అందుకు ప్రమాణము.

| | గ్రామాలు | జనసంఖ్య |
|---|---|---|
| నెల్లూరుజిల్లా వుదయగిరి తాలూకా, | | |
| వెంకటగిరి జమీందారీ ప్రదేశములో | 102 | 58,312 |
| అదే తాలూకా గవర్నమెంటు ప్రదేశములో | 34 | 43,616 |
| దామాయిపాను గవర్నమెంటు గ్రామము | 1కి | 1,272 |
| జమీందారీ గ్రామము | 1కి | 571 |

ఈ జమీందారీ విధాన వికరాళ స్వరూపమునకు యింతకంటె వేరే సాదృశ్యము యేమి కావలెను? యెంత దారుణము! యెంత దారుణము!

"ఈ జమీందారీ విధానమువల్ల ప్రజలు దుర్భరదారిద్ర్యమునకు, దుర్దశకు లోనైరి. జనసంఖ్య క్షీణించినది." అని గోదావరిజిల్లా కలెక్టరుగారగు మారిస్‌గారు మున్నెన్నడో వ్రాసినది, నేటికిని నిత్య

సత్యముగనే నిలచియున్నది. కాదు కాదు. ఈ పాడు పర్మనెంటు సెటిల్మెంటువలె అది పర్మనెంటుగనే వున్నది!

భారత భూమిలోపుట్టిన కర్మవాదులు, సంఘోద్ధాత్ములు, జమీందారీ అభిమానులు, ఈ ఒక్క సాదృశ్యముతో ఒప్పుకుంటారా ?

మన కర్మ భూమికి వెలిగా వేయామడల దూరమునసున్న అమెరికా ఖండములోని ఈ అంకెలు తండ్రియొక్క ఆర్థికస్థితి ననుసరించే వారి సంతానమున, పసిపిల్లల మరణ సంఖ్యలో హెచ్చు తగ్గులుండునని, ఈ దిగువ పట్టికకూడా అరమరలేకుండా అంటూవున్నది.

| శిశుమరణములు. | | తండ్రి సంపాదన | | | |
|---|---|---|---|---|---|
| | | డాలర్లు | | | |
| 1000 కి | 170 | 400 లోపు. | | | |
| ,, | 130 | 450 | మొదలు | 549 | వరకు. |
| ,, | 120 | 550 | మొదలు | 649 | ,, |
| ,, | 110 | 650 | ,, | 849 | ,, |
| ,, | 90 | 800 | ,, | 1049 | ,, |
| ,, | 70 | 1050 | ,, | 1249 | ,, |
| ,, | 60 | 1250 | ,, | యింతకు | పైగా. |

'దరిద్రుల దేహాలలో పుష్టి లేకపోవుట, పరిశుభ్రమైన యిండ్లు, వాకిళ్లు, వ్యాధులకు వైద్యమునకు ధనము లేకపోవుట హెచ్చు మరణములకు కారణము' (భారత దేశము—ఆర్థిక చరిత్ర పుట 71 పా. 1) పై రెండు పట్టికలు అధిక మరణాలకు ఆర్థిక పరిస్థితులే ఆధారమని స్పష్టపరచినవి.

జన నాశన కరమగు ఈ జమీందారీ పద్ధతిని నాశనమునకై ప్రభుత్వము, ప్రజానాయకులు ఏల పూను కోరు ?

# జమీందార్ల కుందేరక్షణలు

తండ్రిచేసిన ఋణము తనయునకు బాధ్యత లేదు.

తానుచేసిన ఋణము తన యెస్టేటుపై చెల్లదు.

తండ్రి తాలూకు యెస్టేటు తమ్ములకు పంచిపెట్ట నక్కరలేదు.

రైతులపై తానెంతయినా శిస్తు హెచ్చించుతూ వుండవచ్చు. కాని తాను మాత్రము ప్రభుత్వమునకు ఆ 1802 సం॥రం నాడు నిర్ణయమైన మొత్తం కంటె చిల్లి గవ్వయైనా చెల్లించ పనిలేదు.

శాసన సభలలో జమీందారులకై యేర్పరుపబడిన స్థానములకు ఇతరులు ఎవ్వరు నిలబడుటకు వీలులేదు. కాని తాము మాత్రము రైతుల స్థానములకు నిలబడవచ్చును.

అసలు జమీందారు బలవంతుడు; దానికి తోడు ప్రభుత్వము వారు యింత రక్షణ యిచ్చారు. ఇక రైతు రక్షణ మార్గములాలోచించే దెవరు ?

కవులకు కట్నాలిస్తే ఇంద్రులు, చంద్రులు, దేవేంద్రులు మీవంటి వారు లేరంటారు యీలోకాన. గ్రంథమండలులకు రాజ పోషకులయితే వీరికీర్తి దిగంతములు పాకుతుంది. సంస్థలకు కాస్తోకూస్తో పాయి విదిలిస్తే మెప్పులతో డప్పులు కొట్తారు.

నాయకులు వినాయకులే. ఇక రైతు గతి ఆలోచించేదెవరు ? కాదుకాదు. ఎవరూలేకేం ! పిఠాపురంవారి ప్రజాపక్షము, చల్లపల్లివారి ప్రజామిత్ర పక్షము, బొబ్బిలివారి జస్టిసు పక్షము. తోడేళ్లే గొర్రెలకు రక్షణ !

కళ్లు తెరవండోయి బాబు ! ఇవి కలికాలపు రోజులు ! అన్నదాత సంగతి ఆలోచించు వాడులేడు.

ఇంటి కడ్డముపడి యేడ్చు బిడ్డలగతి
తలపోసి విలపించు కులకాంతగనియైన,
నా గేటి కర్రుగొని నాహక్కులిమ్మనుచు
ఎలుగెత్తి నీగోడు నెరిగింపలేవా !

శెట్టిపల్లి, గిరిరాజు.

## జమీందార్ల దుర్వ్యయములు

పర్మనెంటు సెటిల్మెంటునాటికన్న వీరు తమకు రావలసిన దానికంటె పదిరెట్లు అక్రమముగ వసూలుచేస్తున్నారు. ఇలా వసూలు చేసినదానిలో రైతులకు ప్రతి ఫలము ఏ రూపముగను ముట్టునదిలేదు. ఈ ధనమంతా ఏమి చేయుచున్నారంటూరా ?

ఒకరికి సీమ కుక్కలయందు, ఇంకొకరికి సీమ పుంజులయందు, మరొకరికి గుఱ్ఱాలయందు, వేరొకరికి మేళతాళములయందు, ఆట పాటల యందు, నాటక కంపెనీలయందు, సినిమా స్టారులనందు మక్కువ ఎక్కువ. విందు వినోదాలకు, పోలో ఆటలకు, గిండీరేసులకు ముస్తాబుగాని జమీందారు జగత్తులో అరుదు. వీట్లకై వీరులక్షలాది ధనం వెచ్చిస్తారు వెర్రివాళ్లలాగ.

దుబారాఖర్చుల్లో ప్రపంచమంతట పెచ్చుగా ఖర్చుచేయు స్వదేశ సంస్థానపతులను వీరు తమ పెద్దన్నలనుగా భావింతురు. వారివలెనే యుండుటకు వీరును ప్రయత్నింతురు, వారు రాజప్రతినిధి విందులకు, పొలిటికల్ ఏజంటులకు ఖర్చుపెట్టితే; వీరు గవర్నర్లకు, కలెక్టర్లకు ఖర్చు పెట్టుదురు. పెండ్లిండ్లకు, పేరంటములకు పెట్టు దుర్వ్యయం అంతేలేదు. పట్టాభిషేకములకు అంతేలేదు. వీరికి పట్టాభిషేకమంటే పట్టా ట్రాన్సుఫరేగా ! తండ్రిపోయిన తర్వాత తనయునకు సనదు

యిస్తారు. దానికొక పెద్దతంతు, డాబు, దర్పము, హడావిడి, అల్లరి, హంగామా! భోగమాళ్లు ఆగమాళ్లు, ఆటలు పాటలూ, కవులు కాకులు, కేకలు, కూకలు! ఇక వీరు, ఏనుగులను, గుఱ్ఱాలను కూడా ఖర్చు చేస్తారు. వీరు రథ, గజ, తురగములను తీసికొని ఎవరిపై దండెత్తు దురో! ఇంతేగాక అరణ్యముల స్వేచ్ఛగా సంచరించు మృగములను పక్షులను తీసుకొనివచ్చి బంధంతురు. ఇలా పశు ఖగముల హింసించుట వీరి చిత్తవృత్తి; వీరికి ఆమోద ప్రమోదములు.

జమీందార్లు పట్టాకత్తులు పుచ్చుకొనే పరివారము వెంటనిడు కొని బరిశీలు, బల్లాలు, ఈటెలు పుచ్చుకొన్న మొనగాండ్రను ముందు నిడుకొని, ఏనుగులు, గుఱ్ఱాలు వెంటనిడుకొని పగటివేషగాళ్లలాగా తిరుగకపోతే లోకనాశనకరులగు అక్షురాజ్యాలవారిని హతమార్చుటకు యీ మందీ మార్బలంతో పోరాదూ? మేము రాజులం, మహారాజులం, మా రక్తనాళాలలో మా పూర్వీకుల శౌర్య ప్రతాపాలు ప్రవహిస్తు న్నాయి అనే ప్రభువులు చేయతగ్గ పని ఏమిటో!

వీరి పరాక్రమములన్ని అమాయిక రైతాంగాన్ని పీడించి పిప్పిచేయు టకే! ఇతరత్రా వీరి పప్పులుడకవు. కాదంటే, మన రాజకంఠీరవులు నేటి రణక్షేత్రమునకు ఎంతమంది ఉరికారో చెప్పమనినా సవాలు. మన జమీందారులలో అవసరమున్నా, లేకపోయినా కొత్తరకపు కారు లన్నీ కొనవలసిందే. వీరు ఎలక్షన్‌లకు ఖర్చుపెట్టు ధనమునకు అంతే లేదు. కృష్ణాజిల్లా జమీందారులు యిందులో అందెవేసిన చేతులన్న సంగతికి అందరికి తెలిసినదే.

జమీందార్లలో కొందరు చేయు దుబారా ఖర్చులు మచ్చునకు చూపెద.

బొబ్బిలిరాజాగారికి గుఱ్ఱాలంటే బహు సర్దా. లక్షలకొలది కిమ్మతు గల గుఱ్ఱాలను కొనుటేగాక, లక్షరూపాయల కిమ్మతుగల మేడను గుఱ్ఱపుస్వారీ (రేసుటర్ఫు) స్థలముకొరకు పడగొట్టించిరి.

పిఠాపురపు రాజాగారు సస్సెక్సుగ్రేడయిలండు, రెడ్సు, వైట్సు, లెగ్ హారన్సు మొదలగు సీమకోళ్లను వేలకొలంది ఖరీదు పెట్టి తెప్పించెదరు. వీటిని బాగా మేపించి వివిధ ప్రదర్శనములకు పంపుదురు. వీరికి కోళ్లయందు కుక్కలయందును సమానసర్దా. కుక్కలంటే దేశవాళీ కుక్కలనుకున్నారేమో! మన వాళ్లకు మనగుడ్డ, మన ఆచారవ్యవహారమునందు లేక శ్వేతజాతుల వేషభాషలు, వారి విహారములందు మక్కువ ఎక్కువైనట్లే సీమకుక్కలందు వీరికి ప్రీతి. వీరి శునక సంఘములు 14 వేల ఖరీదుగలవికూడా వున్నవట. ఇంకా ఎక్కువ, తక్కువవి ఎన్ని వున్నవో వీరి శునకజాతిలో! ఇది వీరి భూతదయకు నిదర్శనము, అనరు కద మన కవీశ్వరులు !

కుక్కలందుండే ప్రీతి వీరికి కూడు, గుడ్డా యిచ్చే రైతులందుంటే ఎంత రాణించును !

స్వదేశ సంస్థానపతులలో యిట్టివారు కలరు. ఇదంతా ప్రభు సంప్రదాయము కాబోలు! సాధారణ మానవులగు మనకు యిందలి రహస్య మేమి తెలుసు! కుక్కలను బాగా ప్రేమించేవారిలో పాటియాల మహారాజు, ఝింద్ సంస్థానపతి మొనగాళ్లు. మన పిఠాపురాధీశుడు వారలమించి మన తెలుగుజెండా ఎగురవేయగలడేమో ?

ఇక వీరి పుత్రరత్నము మాటలో, వీరిని మాటల్లో మించడమేగాక చేతలలోను మించినవారే. స్వదేశ సంస్థానాధీశులలో కీర్తిశేషులగు నవానగరు జాంసాహేబుగారికి క్రికెటు ఆటంటె బహు సర్దా, వీరికి దీని యందు మంచి నిపుణత గలదు. వీరు ఆటలకొరకు విదేశాలకు పోతూ వుండేవారు. మన పీఠికాపురపు యువరాజులను చూడండి. అచ్చమైన తెలుగు రాచబిడ్డ. ఎలాగంటే వీరు వివిధదేశాలనుంచి క్రికెట్ చాంపియనులను మనదేశానికి రప్పిస్తారు ముందే మాట పంపించి. కీర్తించండి కవులు గాయకులు ఆంధ్ర ప్రశస్తిని !

పట్టణములలోని కాస్మపోలిటను క్లబ్బులకు, జింఖానా క్లబ్బులకు, సభలకు సమావేశాలకు గవ్వల్లాగ డబ్బు గుమ్మరిస్తారు.

చూడండి! తమ సంస్థానాలకు తమతో పనివుండి వచ్చిన రైతులు కాసేపు వెన్ను వాల్చుటకు కాస్త వసతైనా చేయరు. పెద్ద భవంతి కాకపోయినా, కాస్త కుటీరమన్నా వేయరు, ఆ కాసేపు కూర్చొనుటకు. ఆ నాడు దివానుగారి దిక్కు లేకపోయినా, జమీందారు గారి జాడా లేకపోయినా విశ్రమించుటకు, ఎప్పుడు వస్తారా అని కూర్చుని ఎదురుచూచుటకు. చీటికిమాటికి అమాయికపు రైతులను కోర్టుల కెక్కించి కొంపలు కూల్చటం తప్ప, రైతులనుండి వసూలు చేసినదానిలో రాగిదమ్మిడీ రైతుకై ఖర్చుపెట్టుట జమీందారులు జన్మ జన్మకైపి చేయరు. రైతు ధనము రైతుకు ఖర్చు పెట్టక, దుర్వ్యయము చేయుట, పరాయివారికి కట్టపెట్టుట వీరికి పరిపాటి. "ఇంటికి జ్యేష్ఠా దేవి, పొరుగుకు లక్ష్మీదేవి" అనెడి సామెత అక్షరాల వీరియందు సార్థకత చెందినది.

కృష్ణాజిల్లాలో ఒక కుర్ర జమీందారున్నాడు. ఆయన చిత్తాను సాధారణంగా సాయంత్రానికి ఒకొక్కరోజు నేకాదు, ఎక్కువ రోజులే నిల్ బాలెన్సు. అనగా దమ్మిడీగూడా దివాణంలో వుండదు. ఎలావుంటుంది? అయన దినవెచ్చమునకు వేయిరూపాయిలు కావాలి. అది రైతుల రక్తనాళములనుండిగాని, భూములను అమ్మనీ, అప్పుతేనీ, ఆయనకల్లా అడిగినప్పుడు అడిగినంత పంపాలి తాణా ఉద్యోగులు. లేకపోతే చివాట్లు చెప్పుదెబ్బలు. ఈవిధంగా ఆరాజు అపర మంగళగిరి పానకాలరాయుడై, రైతాంగానికి, ఉద్యోగులకు ఉరిత్రాడై ఉన్నాడు. ఆయన తన లాభనష్టాలే చూచుకోకపోతే ఇక రైతు కష్టసుఖాలు ఆలోచిస్తాడా? ఆయనచుట్టూ క్షుద్రదేవతలు పరివేష్టించి దరిదాపులకు రానివ్వరు; హితులను, బంధువులను, రైతాంగమును. వీరి అంతుమాలిన దుర్వ్యయమునుగురించి ఏమి వ్రాయుదును.

నా అజ్ఞానముచేత యీయన ఒకడే అనుకొన్నాను. యీ విశాల భారతములో యిట్టి జమీందారులు వేనవేలు కొదు, జమీందారి జాతి అంతా అధోగతికి పోతున్నదని, పాపం! పిఠాపురం యువరాజాగారు 1933 సంవత్సరపు 'హిందూస్తాన్ రివ్యూ' లో జమీందారులను హెచ్చరించుచు వ్రాసినదానిలోని మచ్చుతునక:—"నేడు భారత దేశమున కేవలము నాశనోన్ముఖమైన సంస్థ యేదైన నున్నచో నది జమీందారులనవలయును. జమీందారులు కొలది కాలములో, చేరవనున్న పతనము నిశ్చితము. వివేకముగల జమీందారెవడైన తన భావిదశనుగూర్చి పర్యాలోచన గాంచకున్నచో భీతావహముతప్ప మరేమియు గాన్పించుట లేదు."

తాము బాగుపడి రైతాంగం అభివృద్ధిచెందే మార్గం ఆలోచించ గలరా జమీందారులు! వారిబుర్రలో ఆ ఆలోచనే యెక్కదు. అసంభవము! అసంభవము!

"రైతు మేలుకొక్క రాగిదమ్మిడైనా
ఖర్చు సేయగ బూనుకోరు
దుఃఖకరము చెప్తే వీరితీరు
మా కొద్దీ జమీందార్ల పొందు"

## పీఠికా పురాధీశులు.

పూర్వకాలపు జమీందారులు మంచివారో చెడ్డవారో వారిసంగతి వదులుదాం. వున్నవారిసంగతి విచారించుదాం. వున్నవారిలోకూడా పేరుగలవారినే తీసుకొందాం. బొబ్బిలి, పిఠాపురము, చల్లపల్లి, వెంకటగిరి రాజాగార్లు మేము ప్రజానాయకులమంటే మేము ప్రజానాయకులమని రాజకీయపార్టీలుకట్టి వూరూరా వూరేగుచున్నారు. వారి ఆలోచన ఐశ్వర్యము ప్రజలకొరకే ధారపోస్తున్నట్లు ధర్మోపన్యాసా

లిస్తున్నారు. మిగతా వారి విషయము విడచి వీరిలో విద్వత్ ప్రభువు దీనరక్షకుడు, అనాథపోషకుడు, ఆంధ్రభోజుడు అని అనేక విధముల కీర్తింపబడుచు, విశాలాంధ్రములో వితరణశీలుడని వినుతింపబడి వుత్తమ చరిత్ర కలవాడు, ఆదర్శ జమీందారేగాక, ఆదర్శపురుషుడు అనబడే పిఠాపురము రాజాగారి సంగతి సందర్భములు తెలుసుకొన్నట్లయితే మిగతావారిసంగతి అక్కరనేలేదుకదా?

వీరు కళాశాలలను పెట్టించినారు. కవులను పోషించుచున్నారు. దానధర్మాలకు అంతేలేదనికూడా చెప్పుకొంటున్నారు వందిమాగధ బృందము. వీరికి ఈ ధనమంతా ఎచటనుండి వస్తుందో, అట్టి రైతుల గురించి ఈయన ఆలోచనలెట్టివో, వారి కష్టసుఖములేమి తెలుసుకొంటున్నాడో, వీరి సిస్తువిధాన మెట్టిదో, పన్నులభార మెట్లున్నదో, పరికించిన వారెవరు? ఈయన కాకులనుకొట్టి గద్దలకు వేస్తున్నాడో, లేక కలియుగములో ధర్మదేవతను నాల్గుపాదములతో నడుపుతున్నాడో ఆలోచించేవారెవరున్నారు? యీ దిగువ వివరములు చిత్తగించండి.

ప్రస్తుత ప్రభువులగు కోర్టు ఆఫ్ వార్డ్సు వారు 1906 సం॥లో యస్టేటును స్వాధీనము చేశారు. వీరికి వంశపారంపర్యంగా అవిభక్తమైన పిఠాపురం యస్టేటుగాక, పలివెల, పోలవరం యస్టేట్లుకూడా కలవు—

| ఎస్టేటు | | పేష్కషు | ఆదాయం |
|---|---|---|---|
| పిఠాపురం | రూ. | 2,31,438 | 8,02,721 |
| పలివెల | — | 18,141 | 90,988 |
| పోలవరం | — | 10,885 | 72,065 |
| | | 2,69,464 | 9,65,774 |

యిందు పేష్కషు 2,69,464 పోను పర్మనెంటు సెటిల్మెంటు దాఖలావారికి న్యాయముగా రావలశిన ఆదాయము రు. 1,30,2,32.

అయితే యిప్పుడు వారు రైతులనుండి హెచ్చు వసూలుచేస్తున్నది, రూ. 5,75,0,78. నాటికంటె నేడు రైతులనుండి యింత హెచ్చు వసూలు చేయుచున్నారు. అనగా ఆంధ్రభోజుడు అన్యాయముగా ఆరులక్షలు రైతుల రక్తమునుండి గుంజుచున్నాడు.

| | |
|---|---|
| వీరు పలివెల యస్టేటును కొన్న క్రయధనం | 39,175 |
| దీని పేష్కష్ | 18431 |
| | 57,316 |

| | |
|---|---|
| ఈ యెస్టేటు ఆదాయము | రూ. 90,988 లు |
| పేష్కష్ | 18,141 |
| పోను ఆదాయము | రు 72.847 లు. |

వీరికెట్లు దీనిమీద యింత ఆదాయము మిగులుచున్నది? నేడు యకరము ఖరీదెంత? రైతు ఏమి పండించుచున్నాడో, ఎంత మిగులుచున్నదో ఆలోచించండి!

యిక వీరి ఆదాయమునుగురించి ఆలోచింతము. జమీందారీకమిటీ యెదుట వీరి దివానుగారు తమ ఆదాయమునకు మూడుమార్గములను చెప్పిరి. షుమారు 54 వేల యకరములభూములు శాశ్వతపు పైసలాకు దర్మిలా సాగుకువచ్చినవని, అందువల్ల అదనపు శిస్తుపెరిగినదన్నారు. కమిటీవారు యిది నిజముకాదన్నారు. 1803 సం॥ నాటికి గరిసెధాన్యము 25-0-0 అనియు, యిప్పుడది 100-0-0 వరకు ధర పెరుగుటచే శిస్తు పెరిగినదన్నారు దివానుగారు. ఆనాడుకూడా గరిశె ధాన్యం రు. 85 లు వున్నని దానిని కాదనిరి కమిటీవారు. యింతేగాక శాశ్వతపు పైసలాయితీ కారము ధరలనుబట్టి శిస్తులను పెంచుటకూడా అక్రమమనిరి. నీటి ర్యములు హెచ్చి వ్యవసాయములు బాగుపడినవి. అందువల్ల నీటి ద్వారా శిస్తు హెచ్చినదని మూడవకారణం చెప్పిరి దివాను మహా

శయులు. ఈనీటి సౌకర్యం గోదావరి డెల్టావల్ల ఏర్పడినది. యిందు వీరి పరిశ్రమ లేదు. ఆ కారణంచేత అదనపు శిస్తులు వేయుట అక్రమమనిరి కమిటీవారు. తమ యస్టేటులో వేళంగి, వేములమడ, వగైరా గ్రామములలో చెరుకు, తమలపాకులు పండును గనుక హెచ్చు శిస్తులు రాబట్టుట సబబేనన్నాడు దివానుగారు. ఆ గ్రామములో చింతలతూరంగి, పెనుగుదురు, బొల్లంగి, వగైరాలనుకూడా చేర్చిరి. ఈ గ్రామములలోని భూమి చవిటిది, చెరుకు కాదుగదా, వరికూడా సరిగాపండదు. ఈవాదన వట్టిదే నన్నారు కమిటీవారు. మరియు దీనికి వంతువారడి పద్ధతి కారణమనిరి. అంటే రైతులలో పోటీలుపెట్టి భూములను అమరకమునకిచ్చుట, ఇందువల్లనే హెచ్చు ఆదాయం పెరిగినదనిరి.

ఈ ఆదర్శపురుషుడు కనడా భూస్వాములవలె పంటలను, భూములను, విత్తనములను పరిశోధనలు చేయించి రైతుల ఆదాయమును పెరుగునట్లు జేయకపోగా, రైతులు పండించినదంతయు గుటకాయస్వాహా చేయుచు యింకను అధికపన్నుల కొరకు అర్రులు చాచుచున్నాడు.

వీరు ఆశ్రితులైన కవిపండితులచేత పొగడించుకొనుటయే గాక "పరమార్థచింతనమే మాకు లక్ష్యము, దైవమే మాకు తోడు" అని ధర్మపన్నాలు ఎంతో స్వోత్కర్షగా చెప్పుకుంటారు. వీరికి పరమార్థ చింతన ఎంతయున్నదో ఆ పరాత్పరునికే తెలియవలెనుగాని, పరార్థ చింతన మాత్రము పూర్తిగావున్నది. యీ దిగువసంగతులు చిత్తగించండి.

ఈ ధర్మప్రభువు 1908 సం॥ ల్యాండు ఆక్టు ప్రకారము రు. 1-కి రెండణాలు శిస్తు హెచ్చించవలశినదని రాజమండ్రి సబ్ కలెక్టరు గారగు ఆర్. గెలిటీ ఐ. సి. యస్. గారి కోర్టులో దావా తెచ్చిరి.

1936 సం॥ ప్రాంతముల తీర్పు చెప్పుచు ఆ దొరగారు ఈ అనాథ రక్షకునిపై అక్షింతలిలా వేశిరి. "ఈ రెండణాల అదనపుశిస్తువల్ల జమీం

దారునకు ఎక్కువలాభము కలుగదు. ఎందువల్లననగా జమీందారునకు యిప్పటికే కావలసినంత ధనమున్నది. వున్ననిల్వ ధనమునే ఎస్టేటు అభి వృద్ధికవసరమగు పనులకు, గ్రామసౌభాగ్యమునకు వుపయోగపరచుటకు జమీందారు నేర్చుకొనలేదు.''

యివి వీరి ఐశ్వర్యమునకు ఆధారభూతులైన తమ యస్టేటులోని బీదరైతులు యెడ వీరు చూపు దయాదాక్షిణ్యములకు మచ్చుతునకలు. వీరి దయాదాక్షిణ్యముల నిజస్వరూపము తెలిసినదికదా! యిక వీరి కర్తవ్యపాలన ఎలావున్నదో కనుగొందము. పట్టాట్రాన్స్ఫరులు సరిగా చేయుటలేదు. చెరువుల మరమ్మతులేదు. రైతులకు వుపయోగపడు గ్రామకంఠములు, చెరువు గర్భములు, స్మశానములు కూడా నామిక్కిచ్చు చున్నారు. వర్షములులేక పండకపోయినా, వరదలవల్ల నష్టపడినా, రిమి షను అన్నది శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువులో లేనేలేదు.

అధికపన్నులుకై దావాలు వేస్తారనీ సర్వేలో పల్లపుభూములు మెట్టభూములుగా కనపర్చి వాటిమీద హెచ్చుపన్నులు వసూలుచేస్తా రనీ, జప్తులుచేసి కౌపుకూలిక్రింద చాలా హెచ్చుగా గుంజుతారనీ, ౦కలు పోటీలుపెట్టి చాలా అన్యాయం జరుపుతారనీ, యస్టేటుప్రజలు మీందారీ కమిటీవారియెదుట వేయినోళ్లతో వెలువరించారు.

ఆశ్రితులకు అనేకులు యిచ్చునట్లుగానే వీరున్నూ యిస్తున్నారు. ౦౦కా యేమైనా అదనంగా యిస్తే లోకాన్ని భ్రమపెట్టుటకు మెప్పు ను. వీరి ఆంధ్రభాషా పోషకత్వమునుగురించి అరయుదము. ''సప్త ౦తానములో ప్రశస్తిగాంచి ఖిలముగాకుండు నీధాత్రికృతిగాన'' ౦తి రచింపుమని పెద్దనగారిని కృష్ణరాయలు కోరడములో భాషాపోషక ౦జమంతా బయలగుచున్నది గాదా? తమపేర ఒక నిఘంటువు ౦యించుకోవడము, మరికొందరు కవులను భట్రాజులులాగ పోగచే ౦ని పోషించడమేగా ఆంధ్రభోజుని భాషాపోషణ!

సామాన్యజనులకున్న భోగవిలాసములేగాక విదేశపు కుక్కలు కోళ్లపై వీరికి మక్కువ ఎక్కువకదా! యిందుకై వేలకొలది హెచ్చింతురని యిదివరకే విశదపడినది. ఇట్టి వీరు రైతుబాంధవులని చాటెదరు. వీరిది ప్రజాపక్షమట (పీపుల్సుపార్టీ) వీరు ప్రజాశ్రేణిలో చేరుటకు యిష్టపడెదరా! తమ సంతానమునకే న్యాయప్రకారము ఆస్తిహక్కులను సమానముగా యిచ్చుట కంగీకరింపని జమీందారులా ప్రజాపక్ష నాయకులు? ప్రజలు యాదార్థమెరిగి వీరిని యథోచితముగానే గౌరవించిరి యెలెక్షనులో! వీరి ప్రజాపక్షమునకు పురిటిలోనే సంధికొట్టినది. వీరి జనవాణి జమీందారివాణియని జగద్విదితమైనది.

విద్వత్ ప్రభువులను కొనేవారే, విశ్వమానవ ప్రేమకొరకు పరితపించువారే యీలావున్నప్పుడు యిక వెంకటగిరి, బొబ్బిలి, మునగాల, ముక్త్యాల, చల్లపల్లి, గొల్లపల్లి గొడవయెందుకు?



శాసనసభల కంట-చెపితే సిగ్గుచేటు
మా ప్రక్కపోతారటోయి
పోయి-మా కొంపగూల్చుతారోయి
కడకు-మా కెవరు దిక్కురారోయి
యిట్టి మాటలన్నారంటే మాడ్చివేస్తారోయి.
లంచాలైనా బెట్టి రాజకీయవేత్తల
పంచి తమ ప్రక్కద్రిప్పుతారు-తమ
వంచనము తెలియనీరు-బలె
మంచివారని వ్రాయిస్తారు
ప్రపంచానికి వీరు బాగుబాగనిపిస్తారు.
మా కొద్దీ జమీందార్లపొందు''

నెల్లూరి వెంకట్రామానాయ

# సంస్థానోద్యోగులు

జమీందారులు చిన్నతనమునుంచి కూడ కొంసా దాసీజనముచే ఎంతో అబ్బురముగా పెంచబడి మకురుతనము నేర్చుకొందురు. వారు వీరిని ప్రభువుగారు అని, బాబుగారని సంబోధించుచు ఎంతో భయ భక్తులతో ప్రవర్తించుదురు. వీరు పెరుగునది వారిమధ్యనే. ఆడునది పాడునది, దాసదాసీ జనపుపిల్లలమధ్యనే. ఆ రాచబిడ్డ కొట్టినా, తిట్టినా కిక్కురుమనకుండా వీరు పడవలసినదే! కొట్టగల పెద్దపిల్లలున్నా కొట్టలేరుగదా! కొట్టి బ్రతకలేరుగదా! ఇట్టి వాతావరణములో పుట్టి పెరిగిన వారెట్టివారగుదురో వేరే చెప్పవలెనా? అతనికి చిన్నతనము లోనే తాను పుట్టుకరీత్యా గొప్పవాడనని, తాను ఇతరులను కొట్టినా తిట్టినా పడవలసినదే, కాని పన్నెత్తి మాటాడరాదనే అహంకారము, బాల్యములోనే మొలకెత్తి ఆయనతోపాటు ఆయనకు తెలియకుండగనె పెరుగును.

ఇక వీరి విద్యాభ్యాసము సంగతి చూతము, వీరు కొన్నాళ్లు ప్రత్యేకముగ ఇంటివద్ద చదువుకొని, తమ తమ కొరకు ప్రత్యేకముగా నున్న పాఠశాలలో ప్రవేశింతురు. అక్కడ చదువుమాట దేవుడెరుగును, కాని వీరిలోయున్న చెడుగుణములే అభివృద్ధిపొందుట కవకాశము హెచ్చు.

నేడు కొందరు స్వదేశసంస్థానాధిపతులు పాశ్చాత్యులనే పరిణయ మాడుతున్నారు: మరి మన జమీందారులు కొందరు తెల్లనర్సులచే తమ బిడ్డల పోషణ చేయించు కొంటున్నారు. పాశ్చాత్యుల యెడల వీరికుండే పసందు వారి పాలనా పద్ధతియందుండదేం! వీరి పాలనాపద్ధతి నల్లగానే వుండాలా!

ఇలా తయారైన ప్రభువులు పరిపాలనకు వత్తురు. వారు స్వయం గా వ్యవహరించుకోలేరు. వ్యవహరించుకోటము దర్జాకు భిన్నము! అప్పుడెవరినో ఒకరిని దివాను అనే పేరుతో తెస్తారు.

జమీందారు లెంతబాధ్యతతో వ్యవహరించుచున్నది, ఏ విధముగా రైతులను చూచుచున్నది, దివాను లెట్టివారో మారిస్‌గారు యీ విధముగా వ్రాయుచున్నారు:—

"జమీందారులలో తమ యెస్టేటు వ్యవహారములను చూచుకొను వారరుదు. వారు కేవలము తమమీదనే ఆధారపడియుండెడి పరిపాలనా పద్ధతిగల దివానులకు తమ సర్వవ్యవహారములను వప్పగింతురు. ఆ దివానులు, తమ జమీందార్లను మళ్లా మధ్యలో వేలుపెట్టనివ్వకుండా ఏకచక్రముగా ఏలుదురు. ఈ యెస్టేట్లలో పరిపాలనాపద్ధతి ఏమిన్ని యుండదు. తమ శక్తియుక్తులన్ని వుపయోగించి రైతులదగ్గరనుంచి చిల్లిగవ్వైనా మిగలకుండా పన్నుల పూర్వకముగా గుంజుటయే వీరి ప్రధాన ఉద్దేశము."

(గోదావరిజిల్లా, మాన్యుయల్ పుట 2941)

ఈ దివానుల నియామకమున యోగ్యతకంటె శిఫార్సే యెక్కువ పాటింపబడును. అతను జమీందారును మంచివాడనిపించును. కర్మము చాలక ఆ దివాను మంచివాడైతే మరుక్షణముననే పోవలసివచ్చును. ఈ మధ్య వెంకటగిరి యెస్టేటులో 6 మాసములలో 7 గురు దివానులు, వెళ్లిపోయిరి. కారణమేమంటే ఏ రాజబంధువు కిష్టములేకపోయినా ఆఖరుకు రాణిగారి దాసీ దానికిష్టములేక పోయినా యితడువచ్చిన? పట్టవలసినదే.

ఈ దివాను మనస్సు రాయిచేసుకొని వచ్చినదేదో వడుక్కు. రైతులనుండి అయినదానికి కానిదానికి అక్రమంగా రాబట్టుకుం రాజు తర్వాత తానే రాజగును!

ఈ యెస్టేటులో వుద్యోగము లిచ్చుటకుగాని, ప్రమోషను లిచ్చుటకుగాని, పరిపాలనకుగాని పద్ధతంటూ లేదు.

అందుచేత, సక్రమపద్ధతిని ఏ వ్యవహారమూ సాగదు. అ దు గో అంటే ఆరుమాసములు. రైతులు పెట్టుకొన్న అర్జీలుకూడా కనిపించవు. 'పుంజము పెట్టినది బట్ట, లంచము పెట్టినది మాట' అన్నమాట ఇక్కడ అక్షరాలా జరుగును.

ఈయెస్టేటు వుద్యోగులు, రైతులను పెట్టు బాధలకు మితిలేదు. కాస్తదానికి కూస్తదానికి మేతవెయ్యాలి. వీరు యిటు రైతులబాగు చూడరు, అటు రాజుబాగు చూడరు. తమకు దమ్మిడీ లాభం వచ్చే ఉపాయం వుంటే వుభయులను నష్టము పెట్టుతారు.

యెస్టేటులో వ్యాజ్యములెందుకు హెచ్చో ఎవరైనా ఆలోచించారు? వ్యాజ్యములు పెరిగినకొద్ది వుద్యోగుల మాటలకు, సాదరులకు అవకాశాలు ఎక్కువ. అందుచేత వీరు తరచు ప్రతి వ్యవహారము కోర్టుల కెక్కిస్తారు.

ఇంతేగాక ఈ వుద్యోగులకు చెవులుండునుగాని కళ్లుండవు. మెదడు బొత్తిగా పూజ్యము. వీరి పరాయిల మాటలనువిని, రైతులను అక్రమముగ కష్టనష్టముల పెట్టుదురు. ఈ యెస్టేట్లలో ప్రతివాడు తానే ప్రభువుననుకుంటాడు.

ఏ ఇతర విరోధమున్నా, ఈ జమీందారుగారి ధనము ద్వారా తమ కక్షలను సాధించుకో తలతురు. ఈవిధముగా జమీందార్లు అధికముగా శిస్తులను రాబట్టుటేగాక, రైతులను అన్నివిధాలా కష్టనష్టములకు గురిచేతురు యీ వుద్యోగులు. కొన్ని ఎస్టేట్లలో యిచ్చిన సొమ్మునకు రసీదు యిచ్చుట వీరి రాజమర్యాదకు లోటు! యిక వీరి జమాఖర్చులు పుస్తకాలు అనేక రకములుగా తయారుచేయబడును. మరి పెద్దపెద్ద ఉద్యోగులకు యిచ్చు బహుమతులు, మరికొందరికిచ్చు లంచపంచములు, ఇతరులకిచ్చు మామూళ్లు మర్యాదలు, సప్లయిలు, అన్ని రైతుని కుంగదీయటానికేగా! అవి అన్ని అనేక విధాల వ్రాయబడును. కొందరి

జమీందార్ల చిత్రాలు, కోర్టువారిచే ఫోర్జరీలుగా చెప్పబడినవి. ఇంతెందుకు, సాధారణ వర్తకుని చిత్తామాదిరిగాకూడా వుండవు వీరి చిత్తాలు!

ఈ జమీలలో దివాన్లున్నా, మేనేజరులున్నా, ఎవరున్నా, రైతు దిక్కు మొక్కు ఆలోచించుట యుండునా?

వీరికి ఒక బడ్జెట్టు, పరిపాలనారిపోర్టు, ఆడిట్ మొదలగు నాగరిక పరిపాలన పద్ధతి లేనేలేదు. జమీందారీ రాజ్యము జబర్దస్తీ రాజ్యము. దారిడొంక వుండదు.

జమాబందీయన్నమాట జమీందారీకోశమున లేనేలేదు! అయిన కాడికి జమాబందీతప్ప. ఏమని చెప్పుదు వీరి పాలనా సౌష్టవమును గురించి, నవాబుదర్జా అంతా, పోతూ వీళ్లలో పెట్టిపోయారు ఆ ముసల్మానులు.

రైతు దిక్కుదిశ తోచక గగ్గోలు పెట్టుతున్నాడు ఈ జమీందారీలలో.

"పన్నులభారాలు—పల్లికులంచాలు, పైగా కోర్టు
ఖర్చులోయి
వీటిభారమెపుడు తొలగునోయి
రైతుకు హాయిగా—బ్రతుకెప్పుడోయి
యీ దుష్టపద్ధతి నెపుడు తొలగింతునో దేవ!
మాకొద్దీ జమీందార్ల పొందు

## జమీందారులు: ఆహారసమస్య

మనము జీవించటానికీ, పెరగటానికీ ఆహారం అవసరంగదా! ఆ ఆహారం ఎలా వుత్పత్తి అవుతున్నదో, ప్రజానీకాన్ని పోషించే రైతు ఏ స్థితిలోవున్నాడో ఆలోచించరుగదా బుద్ధిమంతులు! కవులు

రాజులను పొగడుట మినహా, నవధాన్యములు పండించి లోకాభివృద్ధికై పాటుపడు కర్షకుని కన్నెత్తయినా చూడరు. 'రాజునుచూచిన కంటితో మొగుడినిచూచిన మొత్తబుద్ధయిందన్న' సామెత సార్థకత జెందింది మన కవులయెడ. కవులు కాదందురా? అయినచో నేటి కర్షకుని కడగండ్లకై కన్నీరు మున్నీరుగా కార్చి, కర్షక మహాత్మ్యాన్ని కీర్తించిన కవులు ఎందరున్నారు?

మనదేశంలో నేడు కాటకం పలుచోట్ల వ్యాపించి పెక్కువిధములు పెనవేసుకుని పీనుగపెంటలు చేయుచున్నది. క్రిందటి సంవత్సరం ఆకలిబాధతో బెంగాలులో 20 లక్షలమంది ఇహలోకయాత్ర చాలించారు. ఇలా ఈ సంవత్సమేకాదు, మన స్థితిఅంతా ప్రతిసంవత్సరము ఇంతే. మన దేశంలో పండేపంట సక్రమంగా పండినా 5 కోట్లజనం 'అన్నమో రామచంద్రా'యని విలపించవలసినదే.

యదార్థ పరిస్థితులు గమనించని పడకకుర్చీ రాజకీయవేత్త బర్మా, సయాం, జాఫనాన్ నుండి బియ్యం రాకపోవటం, కాందిశీకులు, పరదేశ సైనికులు మనదేశం రావటంవలననే కరువుకు కారణమంటాడు.

ప్రభుత్వం సైన్యానికి అహారపదార్థాలు సమకూర్చే యత్నంలో ఎశేషంగా దాచినందువలననే, కరువుకు కారణమంటాడు పంచమాంగ కళవేత్త.

ప్రభుత్వంవారూ, మరికొందరూ మనదేశంలో జనసంఖ్య పెరగ ంమే కారణమంటారు.

విజ్ఞులైనవారు ఇది వీక్షించండి!—బ్రిటన్ జనసాంద్రత 482, చాన్ 285.3, ఇండియా 176.3. పై దేశములకంటే జనసాంద్రత ాచ్చులేక పోవుటేగాక ప్రపంచం అంతటికంటే సగటాయుర్దాయం క్కువ మనకు. ఇంగ్లండు 62, అమెరికా 64, ఇండియా 26. ఇంతే క అమెరికాలో శిశుమరణములు వెయ్యింటికి 48, ఇంగ్లండు 52,

ఇండియా 127. ప్రస్తుత స్థితిగతులే మన ఆయుర్దాయాన్ని, మన సంతానాన్ని మింగేస్తూంటే మనం వేరే సంతాన నిరోధాన్నిగురించి ప్రచారం చెయ్యటం పనికిమాలినపని. అయినా సంతాన నిరోధం 'త్రాడు చాలకపోతే నుయ్యి పూడ్చుకున్నచందం.' పురుషప్రయత్నంవల్ల మనఐశ్వర్యాన్ని అభివృద్ధి పరచుకొనుటలోనే మన భాగ్యోదయమున్నదిగాని సంతాననిరోధంలో లేదు.

కాని ఈ కరువుకు కారణమేమిటో కాస్త- ఆలోచించుదాం:- మన దేశంలో అనేక జీవనదులు ప్రవహిస్తున్నాయి. భూమి ఫలవంతమైనది. ప్రజలా పాటుపడువారు. పశుధనమా ప్రపంచంలో మూడవవంతను 17 కోట్లున్నది. 'తల్లి రత్నగర్భ, తనయుడు గర్భ దరిద్రుడ'న్న సామెత మనయెడల సార్థకం జెందింది.

ఈ దుస్థితికంతా పరాయిప్రభుత్వమే కారణమంటాడు రాజకీయవేత్త. అందులో సత్యముండవచ్చును. కాని అది పూర్ణసత్యమా? కానిచో ఏదని మీరడుగవచ్చును. ఈ జమీందారులే కొటకానికంతా కాకపోయినా, కొంతైనా కారణమనీ, మన ఆహారపదార్థములు అధికంగా పండించుటకు వారు అనేక అడ్డంకులుగా వున్నారు. చూడండి! ప్రతియస్టేటులోనూ వేలకొలది బంజరుభూమి వున్నది. 150 సంవత్సములనుంచీ వారు దానిని సాగులోకి తీసుకురాలేదు. యస్టేటులోవున్న చెరువులను మరామతు చేయించరు. కాలువలు తవ్వించరు. ఇలా చేస్తువుంటే పంట లెలాపండుతాయి? మన కాహారం ఎలావస్తుంది? కొద్దిగొప్పో నీళ్లున్నచోట రైతులభూమికి రానియ్యకుండా వీరే అడ్డు పెట్టారు వీరి భూములకొరకు. వీరి స్వంత కమతాలలో గట్టూ కనుమ వేయించటంగానీ, సరిగా దున్నించుటగానీ, సకాలంలో వూడ్పించుటగానీ, కలుపుతీయించుటగానీ, కోయించుటగానీ, జరగనే జరగమీ లెక్కడైనా చూడండి— జమీందారీ భూమినీ, రైతుభూ

చెప్పకుండానే చెప్పుతుంది. జమీందారీ వ్యవసాయం నవాబు పరిపాలన అన్నసామెత ఎరగరు ?

ఈవిధంగా వేలయెకరాలు బంజరుగాపెట్టి, మరికొన్నివేల యెకరాలు సొంతకమతమనుపేరుతో నాలుగుగీతలుగీచి, స్వయంగా కష్టించి చేసుకొనే రైతుయొక్క ఫలసాయాన్నంతా పలువిధములైన పన్నుల ద్వారాగుంజుతూవుంటారు జమీందారులు. వారికికావలసిందల్లా తక్కువ భూమి మీాద ఎక్కువశిస్తులు వసూలుచేయటమే!

పై విధంగా జమీందారులు ప్రవర్తించటం వారిస్వార్థంకొరకే. భూమంతా సాగుకిచ్చినా, తాను సాగుచేసినా రైతాంగానికి, ఇతర ప్రజాసామాన్యానికీ ఇంత కూడూ, గుడ్డా వుంటే వాళ్లు చదువుసంధ్యలు నేర్చుకుంటే నేడు ప్రపంచంలోని వృత్తాంతములన్నీ వివిధ సమస్యలన్నీ, కాలమార్పులన్నీ కనులగట్టినట్లు చిత్రించిన పుస్తకాలు చదివితే, ఈ పుత్తడిబొమ్మలకు బ్రతుకుతెరువులు లేకుండా విప్లవం చే[illegible]త్తించి, తారుమారుచేస్తారనే ఉద్దేశంతో అర్ధాకలిలో వుంచేట్లు, సభ్యజగత్తులో స్థానంలేకుండా వుంచేట్లు రైతాంగాన్నుంచుటకు వారు వ్యవసాయం చేయరు. రైతులను సరిగా పండించనియ్యరు, పండిన దాని ఫలితం సరిగా పొందనివ్వరు.

వేయేల వ్యవసాయశాఖవారే మన పంటల తగ్గుదలకు కారణాలు తాటికాయంత అక్షరాలతో పదిగా ప్రకటించారు. అందులో ముఖ్యమైనవి జమీందారు స్వంతసాగు చెయ్యకపోవటం, కష్టపడి దున్నే రైతుకు సొంతభూమి లేకపోవుట ప్రధానకారణాలుగా గమనించవచ్చు. మన హిందూదేశంలో అర్ధభాగం పరభాగ్యహరులగు ఈ జమీందారుల హస్తగతమై వున్నంతకాలమూ కరువుకాటకములుండక తప్పవు! వాస్థ పరిస్థితు లిలావుంటే ప్రభుత్వంవారు మరో ప్రపంచంలో న్నారు. వారు అధికాహారం పండించమని (Grow more food)

వార్తాపత్రికలలో వ్రాయించుటా, రేడియోలలో చెప్పించుటా, సభలూ సమావేశాలలో వుపన్యాసాలిచ్చుటా తప్ప ఫలప్రదమైన కార్యక్రమము కంటికేమి కనపడ్డారు? కోర్టుచుట్టూవున్న ఆవరణలన్నీ దున్ని చల్లిన విత్తుల ఖరీదైనా మళ్లినదా వీరికి? బంజరు భూములన్నీ పేదసాదలకు స్వల్పకాలం వ్యవసాయం చేసుకొనుటకు ఇవ్వటమేగాని, వారికి వ్యవసాయానికై ధనసాయం, ఎరువులూ, విత్తనాలు ఏవి? వారు పండించుటకు?

మన గవర్నరుగారు యాస్టేటు లాండ్ యాక్టును మార్చారు. అధికాహారోత్పత్తి నిమిత్తం జమీందారీ హక్కులకు భిన్నంకాకుండా! అద్దె కొంపలలో వుండేవారు ఇంటిమరమ్మతు చేస్తారా? అల్లాగే ఇదీని! జమీందారు లంతా బంజరుభూమి ప్రభుత్వమువారు గైతాంగానికి ఇప్పిస్తాగనే వుద్దేశంతో ...లుగు గీతలు గీచి ప్రభుత్వపు కళ్లల్లోనూ, ప్రజల నోళ్లల్లోనూ దుమ్ము కొడుతున్నారు! మన యడ్వయిజరు శ్రీ౦తి రామమూర్తిగారు మన్యప్రదేశాలలోని వశకములనన్నిటినీ మారణంచేసి ఆ భూమంతా దున్నిస్తానంటారు. మన నూతన రాజప్రతినిధి వ్యవసాయ విధానంలో తీవ్రమైన మార్పులు తీసుకొస్తానంటాడు. భూస్వామ్య విధానంలో మార్పులేని వ్యవసాయ విధానం మార్పు ఫలప్రదము కాజాలదు. కాః ప్రప్రథమమున భూస్వామ్యవిధానములో మార్పుతెచ్చి మన నిత్య దరిద్రమునకు నిలయమై అధికాహారోత్పత్తికి సర్వవిధములా భంగము కలుగజేయుచున్న ఈ జమీందారీ పెనుభూతమును పెంచలకడనే సాగనంపుట ప్రజాక్షేమాభిలాషుల ప్రథమకర్తవ్యం!

నేను జమీందారీ రైతునగుటచే పిడుగుకు పిచ్చుకకూ ఒకటే మంత్రంగా, ఈ సందర్భంలో జమీందారు పద్ధతి రద్దుకావాలని చెప్పాననుకోకండి! స్లేట్ కమిషన్ వారుకూడా, పర్మనెంటు శెటిల్ మెంటు ర‌ద్దు చేసి వ్యవసాయంచెయ్యకుండా కేవలం శిస్తుచెల్లిస్తూ భూమిమీద హక్కు

గలిగిన వారినుంచికూడా ప్రభుత్వం భూమిని వశపరచుకొని, వారికితగిన నష్టపరిహార. మివ్వవలసిందని సిఫార్సుచేయుటలో ఆంతర్యం, ఈ జమీం దారులు అధికాహారోత్పత్తికి అడ్డువస్తున్నారనే !

కనుక ప్రజలకు ఇంత కూడూ గుడ్డ కావాలంటే, ప్రధానకర్తవ్యం ఏమిటో తెలిసిందా ? ఇంతా చెప్పి మనసాగుబడి సంగతి చెప్పకపోతే ఎట్లా? మన దేశంలో 28 కోట్ల 10 లక్షల యకరాలు సాగు. అందుపల్లం, 5 కోట్ల 20 లక్షలు యకరాలు. (1936-37 లెక్కల ననుసరించి) మద్రాసురాజధానిలో 360 లక్షల సాగు. అందు పల్లం, 85 లక్షల యకరాలు. మన భారతదేశములో సుక్షేత్రమువంటి భూమి 15 కోట్ల యకరాలు బంజరుగావున్నది. ఏడి నాథుడు దీనికి ? అధిక ఆహారోత్పత్తి ! అధిక ఆహారోత్పత్తి ! అని ప్రభుత్వం, అన్నం ! అన్నం ! అని ప్రజలు, పోవాలి జమీందారి విధానమని రైతాంగం ! ఈ సమస్యాపరిష్కార సాధన, భూస్వామ్యము రైతునకు కలిగేటట్లు చేసి ప్రభుత్వం అన్ని విధముల రైతులకు బాసటగా నిలుచుటే !

## జమీందార్లంటే - ద్వేషం యెంచేతా ?

"ఇది ఒక మితవాది వ్రాసినది. ఆయన జమీందారీపద్ధతి పోవాలనేవాడుకాడు. జమీందారులలో మార్పు రావాలనేవాడు. జమీందారుల నేటి స్థితిగతులను చిత్రించాడు. దానిలో రైతుల కష్టనష్టాలు కళ్లకు కట్టాడు. చిత్తగించండి :

"ధర్మమా, అధర్మమా ?" అంటె అది వేరేవిషయం. కాని మీందార్లంటే దేశంలో యేవగింపు కలిగింది. ఆదరం తగ్గింది. నమ్మకం స్నగిలింది. నిరసనం ప్రబలిపోయింది.

"జమీందారీలు పోవాలి. ప్రభుత్వానికీ, ప్రజలకీ మధ్య యీ సీల అవసరం యిప్పుడేమీ లేదు." అని నొక కొత్తభావంకూడా మరిస్తోంది.

దీనికంతటికీ రష్యానుంచి దిగుమతీ అవుతున్న బోల్షివిజ్కు వాఙ్మయం ఊత కలిగిస్తోందంటే అది కొంత నిజమే కావచ్చు. కాని అది కారణం వేరే కనబడుతోంది.

అది యిక్కడే పుట్టి యిక్కడే పెరిగిపోయింది. దాని విత్తనము యిక్కడిదే. దానిదోహదము యిక్కడిదే.

అమాయికులైన రయితుల్లో యీ వైముఖ్యం పుట్టింది. అధికార వాంఛలేని జనసామాన్యంలో యిది వేరు తన్నింది.

అయితే, ఇది స్థిరంగా వుండిపోతుందా ?

"దీన్ని అణచివెయ్యలేక పోతామా ?" అనికాదు జమీందారు లిప్పుడు యోచించుకో దగ్గది.......

వేలసంవత్సరాలనుంచి యెలాంటి కష్టనష్టాలలుముకున్నా, ప్రభుభక్తి కళంకం కలగనిచ్చుకోనివారు, ప్రతిఫలం తక్కువయినా సుస్థితి కోరి ప్రాణాలర్పించిన యోధులసంతతివారు, ఇవాళ తమ విషయంలో పెడదారి తొక్కుతున్నారంటే, యేమిటో జమీందార్లుకొంచెం పర్యాలోచించుకోవాలి.

పోనీ అని వూరుకుంటే యిది రాజుకుంటుంది. ప్రతిస్పర్ధపూనితే భగ్గుమంటుంది.

జమీందార్లకీ జనసామాన్యానికీ మధ్య నొకవిధమైన అంతరం వుండాలంటే అదిసబబే.

కాని 'ఎంతపొట్టు కంతగాలి' అన్నట్టు వుభయుల కష్టసుఖాలకీ రాశిలో తప్ప రకంలో భేదంవుండకూడదు.

వెనకటితరాల జమీందార్లు యీరహస్యం బాగా గుర్తించారు. వారు దీన్ని జాగ్రత్తగా కాపాడుకుంటూ వచ్చారు.

కాని యిప్పటితరంవారికి రైతులంటే ఉదారభావం లేదు. రైతులు తమయెడల భయభక్తులు కలిగి వుండాలనే ఆశ మాత్రం పూర్తిగావుంది.

శిస్తు తెచ్చి తమ పాదాలదగ్గిర దాఖలుచెయ్యడం, రైతుపూచీయని, జమీందార్లు బాగా యెరుగుదురు. కాని వారు శిస్తుచెల్లించగలిగేటట్లు ఆధారాలు కలిగించడం తమపూచీ అనిమాత్రం యెరగరు.

గవర్నమెంటు గ్రామాల్లోవుండే రైతులకంటే, జమీందారీ గ్రామాల్లోవుండే రైతులకి శిస్తులెంతయెక్కువో వ్యవసాయ సౌకర్యాలు అంతతక్కువ.

ఎంచేతా?

తాబేదార్లంతా యేంచేస్తున్నారూ?

శిస్తంతా యేమైపోతోందీ?

జమీందార్లకి రైతులంటే యింత నిగహా లేకపోవడంయేమీ?

కొంతమట్టుకైనా ప్రపంచప్రవృత్తిని అర్థం చేసుకొంటూవున్న జమీందారీ రైతులు, ఇలా కిందామీదా పడ్డంలో అస్వాభావికం యేమీ లేదు.

రైతుకి యిలాంటి వితర్కింపు కలగనివ్వడమే జమీందార్ల మొదటితప్పు. దీనికైనా వారు వెంటనే సద్దుకోకపోవడంవల్ల, రైతుల హృదయాల్లో కొత్తభావాలు చిలవలూ పలవలూ పెట్టాయి.

వెనకటితరం జమీందార్లకి వూరువిడిచిపెట్టడం అంటే శిక్షగావేది. ఇప్పటివారికి వూళ్లో వుండడం అంటే యమచెరగా వుంటోంది.

వెనుకటి జమీందార్లు రైతునకు దర్శనం యివ్వడంఅంటే పండుగు పొంగిపోయేవారు, ఇప్పటివారు రైతులనుచూసి వెలపరించు ారు.

ఎవరికీదర్శనం యివ్వడానికైనా యిప్పుడు జమీందార్లు వూళ్లో వుంటేనా?

నీటిలోవుంటేనే తామరపువ్వు, అలాగే స్వగ్రామంలోవుంటేనే జమీందారు.

మన జమీందార్లు ఏడాదిలో సగానికిపైగా సరిహద్దుకిబైటేే తంతికేనా తిన్నగా అందనిచోటే వుంటారు. తమ కష్టసుఖానికి కాని జమీందార్లమీద, రైతులకి భక్తి అంటే యేమిటి? ఆదరం అంటే యేమన్న మాటా?

చెమటవోడ్చీ, మట్టిపిసికీ, అంబలితాగీ, గోచీ ధరించీ, రాత్రీపగలు అనే భేదం లేకుండా పొలంలోనే పడివుండి, రైతు సృష్టించిన ద్రవ్యాన్ని జమీందారు మహానగరాల్లో తారురోడ్లమీద వెదచల్లుతూ వుంటే యేరైతుహృదయం చలించకుండా వుంటుంది?

రైతుల స్త్రీలనగలు వొలిపించీ, చెంబూ ముంతా వేలంవేసీ, ఆ వ్యథితహృదయాలు చీల్చుకొనివచ్చే శాపనార్థాలువింటూ తాబేదార్లు వసూలుచేసిన శిస్తును జమీందారులు విలాసవస్తువులకోసం దేశాంతరాలకీ, ఖండాంతరాలకీ యెగుమతీ చేస్తూవుంటే యేతాబేదారు హృదయం కలుషితం కాకుండా వుంటుంది?

జమీందారీ గ్రామాల్లో జలాధారాలు పూడిపోతున్నాయి. పశువులకుగ్రాసం దొరకడంలేదు. రోడ్లులేవు. పాఠశాలలులేవు. జనుల దేహాల్లో రక్తమాంసాలుకూడా—కళ్లల్లో నీళ్లుతప్ప మరేమీలేవు.

ఇలాటిస్థితిలో జమీందార్లు మహానగరాల్లో మోటార్లమీద విహరిస్తూన్నారంటే, నృత్యగానాల్లో పరవశులవుతున్నారంటే వూళ్ళల ద్వేషంకాక ప్రీతి యెలావుంటుంది.

(భారతి ౧౯౩౮ మార్చి పుటలు ౪౬౨-౬౩)

శాస్త్రిగారెంతో ఆవేదనతో వ్రాశారు. ఇందులో అసత్యముగాని, అతిశయోక్తిగాని లేదు.

ఇది వారి చెవుల్లోదూగుతుందా? వ్యాసుడనలా. "నేను రెండు చేతులు ఎత్తి మొత్తుకుంటున్నను "ధర్మము, ధర్మము" అని, ఎవరు విన్నారు? అయిన ఆర్తనాదము, కాదు, ధర్మవాక్యము. కాని ఫలితం అనుభవింపలేదా? అలాగే జరుగక తప్పదు.

ఈజమీందార్ల విపరీతపరిస్థితులనుగురించి, పిఠాపురపు యువరాజు "ప్రపంచంలోకల్లా అధోగతికి పోతున్నజాతి ఏదైనావున్నదంటే అది జమీందారీజాతి" అని మోడరన్ రివ్యూలో విలపించాడు.

ఆ విలాపము కాని, రైతులఆర్తనాదముకాని, వారివీనులకెక్కదు. అసలు హితవాక్యం చెప్పువారు అరుదు. వినువారంతకంటె అరుదు. అందులో విలాసపురుషులా వినునది? చెడిపోయినవారా చెవియొగ్గునది!

స్వార్థపరుల స్తోత్రాలాపములముందు ఇది చొచ్చునా? జ్వరరోగికి పంచదారచేదు. అలాగే వీరికి హితవాక్యం ఎక్కదు.

జమీందారు రైతును నాశనంచేస్తూ తాను నాశనం అవుతున్నాడు. ఉభయతారకం వున్నదా? ఆహా! వున్నది. జమీందారీ విధానము రద్దే. మానవకల్యాణానికి మరోమార్గము లేదు.

"ఏ వాడిబురదనో ఏ వాడిముండ్లనో
పలుకష్టములు బడి పంటపండిస్తావు
కడుపునిండా కూడు కాన్పించదేమి
నీ కష్టములకింక నియమంబులేదా?
ఊరకుంటా వేల నో రైతు రాజా!
ఎలుగెత్తి నీ హక్కు వెలిగింపలేవా!
ఎలుగెత్తి నీ శక్తి నెరిగింప లేవా!"

# జమీందారీ విధానము - నూతన ఆర్థికవేత్త

నేడు నూతనముగా అనేక సిద్ధాంతములు బయలుదేరినవి. అందలి ఆర్థికవిధాన రహస్యమును ఒక ఆర్థికనీతికోవిదుడు యీ విధంగా స్పష్టీకరించెను. మన జమీందారీ విధానాన్నిగురించి చెప్పినది గమనార్హము.

సోషలిజము: నీకు రెండావు లుంటే వానిలో నొకదానిని ప్రక్కవానికి యిమ్ము.

కమ్యూనిజము: నీకు రెండావులుంటే వానిని గవర్నమెంటుకిమ్ము. నీకు కావలసిన పాలను యిస్తుంది.

ఫాసిజము: నీకు రెండావులుంటే వానిని నీదగ్గరనే యుంచుకొని పాలను మాత్రము గవర్నమెంటు కిచ్చెయ్యి. గవర్నమెంటు ఆ పాలలో కొన్ని పాలు నీకు అమ్మును.

కాపిటలిజము: నీకు రెండావులుంటే ఒక ఆవును అమ్మివేసి ఒక ఎద్దును కొనుక్కో. ఇక నీ ఆలమందకు అంతులేదు.

లాండు లార్డిజము: నీకు రెండావులుంటే పాలను భూసామికిచ్చివేసి నీవు పిడకలమ్ముకొని బ్రతుకుము.

నిజముగానున్నదో లేదో ఆలోచించుకోండి. పైన సంగలన్నియు తెలిసినా తెలియకపోయినా, మనకు అనుభవము ఉన్నప జమీందారిపద్ధతి. మన రైతులు అష్టకష్టములు పడుట, జమీందార భోగభాగ్యము లనుభవించుట అందరికి తెలిసినదే కద! నిజముగా జమీందారీరైతులు, ఆర్థికవేత్త చెప్పినట్లు కష్టపడి ఆవును మేపి పా జమీందారుకిచ్చి, పిడకలతో జీవయాత్ర గడుపుచున్నారు. ఇంత తెల్లముగా మనసంగతి చెప్పినందుకు ఆర్థికవేత్తను అభినందించవలసిన మనం పాలుకోసం ప్రయత్నించవలసినదే.

"కలకాలమెండనక కష్టించి పండించి
కడ నాకు మా కడుపుగొట్టి మాదు
కొంప భగ్గున మండపెట్టి మాదు
కండ్లల్లో దుమ్మెత్తి కొట్టి వారు
కళ్లములో గింజైన, మళ్లకుండజేస్తారు
మా కొద్దీ జమీందార్ల పోందు."

నెల్లూరి వెంకట్రామా నాయుడు

## జమీందారీ పద్ధతి - రివిన్యూబోర్డు

పంతొమ్మిదవ శతాబ్దములో జమీందార్లు కొందరు, తాము చెల్లించవలసిన పేష్కష్ చెల్లించలేకపోయిరి. వారి పరిపాలనాపద్ధతి అంతకంటె అధ్వాన్నముగనుండెను. దీనిపై యీ యెస్టేటులుంచుటా, వూడ బెరుకుటా అని ఆలోచించుటకు ఒక కమీషనరును ఏర్పాటుచేసిరి. ఆ కమీషనరు కాళ్లగడ్డము పట్టుకుని, తమ పొట్టమీద కొట్టవద్దని జమీందార్లు వేడుకొనగా, అతనెంతో జాలిదలిచి యీ యెస్టేటుల నుంచవలసినదనియు, యికముందు ప్రజలకుగాని ప్రభుత్వమునకుగాని కష్టనష్టములు రాకుండా కట్టుదిట్టము చేసితిననియు పెద్ద రిపోర్టువ్రాసెను. దానిపై రెవిన్యూబోర్డువారిలా రిమార్కులు వ్రాసిరి:

"మధ్యను అధికారిని వుంచుటచే, యీ పద్ధతి ఎంతమార్చినను నికరమైనదే. కల్పింపబడిన జమీందారు. అనాదిసిద్ధముగా నున్న తు. యిద్దరు ప్రొప్రయిటరులను యీ విధానము తెచ్చిపెట్టినది. వీరియుల ప్రయోజనములు పరస్పర భిన్నములు. హిందూదేశపు రివిన్యూలో రైతు ప్రముఖస్థానమును ఆక్రమించును. అతనే అన్నిటికి కారభూతుడు. వానినుండే శిస్తంతయు రాబట్టబడును. జమీందార్లు

సంపాదించిన హక్కులు, అధికారములవలన వాని ఘనత నాశనము చేయబడెను. కాని ఉనికికే భంగము వాటిల్లెను. జమీందారు, రైతు వీరిద్దరి లాభములు కలసి వర్ధిల్లజాలవు. వారిద్దరు పోటీపద్ధతిలో పెట్టబడిరి. ఎవరో ఒకరు ఓడిపోక తప్పదు.''

(గోదావరిజిల్లా మాన్యుయల్ పుట 294)

రైతు ఓడింపబడి, అధోగతికి త్రోయబడిన సంగతి కనులకు కన్పట్టుచున్నది కద! ఇంక నేమి వ్రాయుదు ?

చెరువులు తెగెనంచు చెప్పుకుంటె మీరు
మొరపెడచెవిని బెట్టుతారు
కరువు కాటకాలను చూడరారు
శిస్తు తరువుబెట్టి గుంజుతారు
వీరి కఱుకుపాలన వేగ
కడదొలచుమో దేవ
మా కొద్దీ జమీందార్ల పొందు.



## జమీందారీపద్ధతి - మారిస్

[వీరు గోదావరి జిల్లా పూర్వపు కలెక్టరుగారు. తమచే ప్రకటింబడిన గోదావరి జిల్లా మాన్యుయల్లో పర్మనెంటు సెటిల్మెంటు గురించి, జమీందార్లను గురించి యీ విధముగా ప్రకటించిరి:]

''ఈ శతాబ్దారంభమున యీ జిల్లాలో ప్రవేశపెట్టబడిన పర్మనెంటు సెటిల్మెంటు పూర్తిగా విఫలమొందినదని చెప్పుటలో యెంమాత్రము సందేహము లేదు. అది ప్రజల కోర్కెలకు భిన్నముగా ప్రవేశపెట్టబడి, మిక్కిలి అవివేకముగా, పరిపాలింపబడెను. పూర్వపు జమీదార్లు, కొత్త ప్రొప్రయిటరులు, ఉభయులూ దుబారా ఖర్చుదారులు

జాగ్రత్తలేనివారు. వారు కార్యనిర్వహణములో బొత్తిగా పనికిమాలిన వారు. వారు గవర్నమెంటునకు యివ్వవలసిన పేష్కషును యివ్వలేక బకాయిపడిరి. రైతులకు విధిపూర్వకముగా తాము చేయవలసియున్న కార్యములను ఎంతమాత్రమును చేయరైరి. ఈ పద్ధతివలన జనసంఖ్య క్షీణించినది. రివిన్యూ తగ్గినది. ప్రజలు దారిద్ర్యమునకు, దుర్దశకు లోనయిరి.'' (పుట 296)

అనుభవముతో చెప్పిన కలెక్టరుగారి సంగతిని గ్రహించితిరి గదా! ఇక ఆలోచించండి! రైతులోకము, తద్బంధువర్గము, మానవ కల్యాణమునకై ఉత్సహించు ఉదారవర్గము, యీ పరమనెంటు పిశాచాన్ని మన భరతఖండమునుంచి బైటకు పారదోలుటకు.

పన్నులు విధించుటలో పద్ధతేమిలేక
కన్నుగానక దంచుతారు.
పండినవన్ని శిస్తుకు ఊడుస్తారు,
కూలికన్నా రైతుకు మిగులనీరు.
యిట్లెన్నినాళ్లు రైతు యేడ్చి బ్రతికుండెను
మాకొద్దీ జమీందార్లపొందు.

## జమీందారీ విధానము - గెలట్

[పూర్వకాల జమీందార్లను గురించి మారిస్‌గారు చెప్పిరి. ఇప్పటి లపు జమీందార్లు, విద్యావంతులు బాధ్యత తెలిసినవారు అని కొందరు సపడవచ్చును. గోదావరిజిల్లా సబ్ కలెక్టరగు ఆర్. గెలెట్ ఐ. సి. స్. గారు పిఠాపురపు రాజాగారు హెచ్చుశిస్తుకై రైతులపై వేసిన వాలో తీర్పు చెప్పుచు (1936 సం॥రంలో) పర్మనెంటు సెటిల్మెంటును ంచి, జమీందార్లను గురించి యిలా వ్రాశిరి.]

''పర్మనెంటు సెటిల్‌మెంటు గావించబడినపుడు, జమీందారులు శ్రద్ధాభక్తులు కలిగి, తమ జవాబుదారిని గుర్తెరింగి బాధ్యత వహించెదరని వుద్దేశింపబడెను. కాని యీ వుద్దేశము నెరవేరలేదు. ఈ పర్మనెంటు శెటిల్‌మెంటు కొందరు విమర్శించినటులనే, హానికరముగ నున్నది. భూస్వాములు తమ యెస్టేట్లలో నుండక ఏజెంట్లను నియమించి శిస్తును వసూలు చేసికొనుచున్నారు. ఈ యేజెంట్లు ఎన్ని అక్రమములు గావించి నను వారిని మందలించుట లేదు....''

తమ ఎస్టేట్లలో రోడ్ల అభివృద్ధి, నీటివసతులు, విద్యాభివృద్ధి మొదలగు కార్యములకు జిల్లాబోర్డులకు గాని, ప్రభుత్వమునకు గాని సహకారము సల్పుటలేదు. ఇటువంటి భూస్వాములు, ఇప్పటికే మిక్కుటముగానున్న శిస్తులను ఇంకను హెచ్చించవలయునని కోర్టుల కెక్కడము సరియైనది కాదు. వారు చట్టముయొక్క ప్రధానోద్దేశమును గమనించక, కేవలము చట్టమును పురస్కరించుకొని లాభము పొందచూచుచున్నారు. ఇందునకు ఆఖరునకు ఫలితము ప్రకోపమే.'' ఈ ఫలితము వారనుభవించునదెపుడో కద!

కలకాల మెండనక
కష్టించి పండించి
కడనాడు మా కడుపుగొట్టి
మాదుకొంప భగ్గున మండబెట్టి
మాదు కండ్లల్లో దుమ్మెత్తికొట్టి
వారు కళ్ళములో గింజైన
మళ్ళకుండ చేస్తారు,
మా కొద్దీ జమీందార్లపొందు.



# జమీందారీ విధానం - ఆచార్య గోగినేని రంగనాయకులు

[ఆచార్య రంగాగారు రైతుల కష్టసుఖములు బాగుగ తెలిసిన రాజకీయవేత్తేగాక, ఆంధ్రదేశమున రైతుఉద్యమము ఆరంభించి, దానిని యావద్భారతదేశమున వ్యాపింపచేసిన రైతు నాయకుడు. తన సర్వస్వము రైతురక్షణకై ధారపోయుచున్న రైతుబాంధవుడు. నేటి రైతులలో కలిగిన కించిత్ చైతన్యమునకు యీ మహామహుడే కారకుడు. అట్టి రంగాగారు ఆంధ్రదేశ జమీందారీ రైతుమహాసభకు (వెంకటగిరి 8-9-31) అధ్యక్షులుగా నుండి ఇచ్చిన ఉపన్యాసమునుండి యీ దిగువ భాగము ఉద్ధృతము.]

"జమీందారీ రైతుల కన్నివైపులను నిర్బంధము లే కలవు. స్వాతంత్ర్యము వారికి దూరమైనది. భూములసాగుచేసుకొందమా యన్న భరింపరాని శిస్తులు చెల్లింపవలయును. తమ భూములలో బావులు త్రవ్వ కొని, తోటపంటలువేసిన యధికశిస్తులు. ఎండకాలమందెప్పుడో యగత్య మగునప్పుడు చెరువునీరు కొంచెముగా పెట్టుకొందమన్న, సంవత్సరమునకు ముందుగా జమీందారుగారి అనుమతికొరకు వ్రాయవలసియుండును. అనుమతి సకాలమునకు రానిచో ఇబ్బడిరెట్లు చెల్లించవలెను. మాగాణి భూములు రెండవపంటవేసిన ప్రత్యేకశిస్తు.........పశువుల మేపుకొను టకై, కంచెలు, మందబయళ్లు వగైరాలు కావలెనన్న గ్రామ గ్రామ ములమధ్య పోటీలురాకుండ, మామూలుగానున్న శిస్తు హెచ్చుగాకుండా, కాలమునకే శిస్తు తీసుకొని కంచెలు రైతుపరము జేయించుట కెన్నో ప్పలు పడవలసి యున్నది.......ఎంతమంది యుద్యోగస్తుల కెన్ని రులు, ఎన్ని మామూళ్ళివ్వవలసివచ్చుచున్నదో, జమీందారుల కెంత ఎలొంగవలసి వచ్చుచున్నదో భగవంతునికే యెరుక..........

ఇన్ని విధములగు నిర్బంధముల కొప్పుకొన్నను, మన రైతుల న మైన లాభముకల్గించుట కేమైన యీ జమీందారులు ప్రయత్నించు

చున్నారా యన్న, లేదు, లేదు, లేదు; అను సమాధానము అన్నియెడల కానవచ్చుచున్నది. తమప్రజలు బాగుపడుటకై శాసనసభా సహాయముచే అప్పుల భారము తగ్గించుటకుగాని, సహకారోద్యమము వృద్ధి యగుటకు గాని, వ్యవసాయపు పద్ధతులు లాభకరముగా నుండునట్లు చేయుట కాని, క్రొత్తయిరిగేషను ప్రాజెక్టు పెట్టించి, గొప్పతటాకముల త్రవ్వించి, నూతన వ్యవసాయ పరికరముల దెప్పించి, మరి యే విధముగా గాని జమీందారులు సహాయపడినది లేదు. బోర్డులద్వారా నైనను, రహదారీ సదుపాయములుగాని, మంచినీటివసతులుగాని, పాఠశాలలుగాని, గ్రంథాలయములుగాని, గ్రామగ్రామముల కుండు రహదారి రోడ్డులగాని, వీరు హెచ్చుగా వేయించి, తమ రైతులకు సహాయము కలిగించి పుణ్యము కట్టుకొనలేదు. తుదకు తమ సొత్తుగా యున్న తమ యెస్టేటుల నైన బాగు చేసిరా యన్న, ఆ పాపము కట్టుకొనలేదని సమాధానము వచ్చుచున్నది. ఎచ్చటి యేరు లట్లే పెడత్రోవలం బోవుచున్నవి. ఎక్కడి ఆనకట్ట లట్లే మరమ్మతులు లేకయున్నవి. ఎచ్చటికాలువలట్లే, ఏరు వలే, దారులుత్రప్పి వంకలు తిరిగి, దరిదాపులేక నాథుడులేకున్నవి. ఎక్కడిచెరువు లట్లే మరమ్మతులు లేక, మెరకలెత్తి, తూములుపోయి, కట్టలు జారి నీరు వట్టి పోయి ఘోషపెట్టుచున్నవి. ఇటుల నన్నివిధముల ననర్థకపు జీవితము నడపుచుండుటయే కాక చేతకాని పెత్తనముల నొకదానిపై నొకదాని పెట్టుకొనుచు, రైతుల ప్రాణముల దీయుచున్న యీ జమీందారీ పెత్తన మెందుకో తోచకున్నది.......

జమీందారు లిట్టివేరుపురుగులై, సంఘశక్తిని పీల్చి పిప్పిజేయుచున్నారే! వీరివలన సంఘపుటంగములో నెద్దానికి సుఖముగాని లాభముగాని లేదే, వీరి పెత్తనమెందుకు సాగనిచ్చుట!......

ప్రజల దునుమాడు వారిలో నొకరుగా తప్ప జమీందారు లేమాత్రము లాభకారులు కాకుండుటయే కాక, పైగా నష్టము కల్గించు రైతుల ఆర్థిక, నైతిక రాజకీయాభివృద్ధి నడ్డగించుచున్నారు.

ప్రభుత్వమునకు, రైతునకు మధ్యవర్తు లుండరాదు. అందు ముఖ్యముగా జమీందారు లుండరాదు. మనకున్న యనుభవమును బట్టి జమీందారీ మధ్యవర్తు లంత ద్రోహులు మరెవరును లేరు!''

రైతు లా రంగాగారి మాటప్రకారం, రంగము లోకి రండు. జమీందారీ బాధను పోగొట్టుకొండు.

## జమీందారీ విధానము - రెబ్బాప్రగడ మందేశ్వరశర్మ

[శర్మగారు పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు కాపురస్తులు. జమీందారీ రైతు నాయకులలో ప్రముఖులు. ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు సంఘముచే నియమింపబడిన జమీందారీ విచారణకమిటీకి కార్యదర్శిగా పనిచేసిరి.]

''భారతదేశములో గల వ్యవసాయిక భూమిలో సగముకంటె పైభాగము జమీందారులకు చెందియున్నది. గ్రామపంచాయతీ మొదలు, ఢిల్లీ అసెంబ్లీవరకుగల శాసనసభయొక్క ఓటర్లలో అధిక సంఖ్యాకులు జమీందారీలలో యున్నారు. దేశపుటార్థిక సంపత్కరములైన నదులు, వాగులు, అడవులు, గనులు మున్నగునవి కూడ ఇచ్చటనే అధికముగా నున్నవి. కాని దేశముయొక్క అజ్ఞానమునకును దారిద్ర్య దాస్యములకును కూడ యీ జమీందారులే గర్భగుళ్లు. ప్రపంచములోని అమెరికా, యింగ్లాండు, ఆస్ట్రేలియామున్నగు దేశములలోని రైతులు సమృద్ధిగా ఆదాయముతో కూడును గుడ్డయు గలిగి రోజుకు మూడురూపాయలకు తక్కువ కాని సుఖజీవనమును చేయుచుండగా, సర్వ ఖనిజములకు నిధియై సర్వ సస్యములకున్ను అనుకూల ప్రసిద్ధిగాంచిన యీ భారతదేశములోని రైతు యొక్క రోజు వారీ సగటు ఆదాయము మూడుకానులు మాత్రమే.

రైతువారీ గ్రామములోని రైతులకంటె జమీందారీ రైతులు కడు పేదవారు, కడుదీనులు, కడువిద్యా విహీనులు. దేశముయొక్క ఆహారోత్పత్తికిని, ఆర్థిక సంపదలకును మూలమైన కోట్లకొలది యీ

జమీందారీ రైతులు యిట్టి దీనస్థితిలో యున్నంతకాలము దేశమున శాంతిగాని సౌఖ్యముగాని నిజమైన స్వరాజ్యముగాని ప్రవర్తిల్లుటకు వీలులేదు. దేశసంపదకు మూలకందమైన రైతు సుఖమునకు గాని రాజ్యము స్వరాజ్యమా ?

నేడు ప్రతి భారతీయుడును యీ జాతీయ దృక్పథమునుండి జమీందారీ రైతుసమస్యను వీక్షించి శోధించి పరిష్కరింప వలసి యున్నది. వ్యక్తులను మరచి దేశక్షేమ దృష్టితోడను, ధర్మవ్యవస్థ నిర్ణయించు భావముతోడను, పరిష్కరింపని సమస్య భారత ప్రజాళివైపు అత్యాతురతతో నిరీక్షించుచున్నది.

ఈ రైతు దుస్థితికి కారణమేమి? దానిని నివారించు మార్గమేమి?
(జమీందారీ రైతుసమస్య 1. 2, పుటలు)

ప్రస్తుతమున్న యీ జమీందారీ పద్ధతి ఆచరణలో దేశాభివృద్ధికి మిక్కిలి ప్రతికూలములు. ఈ సమస్యా పరిష్కారమైన కాని దేశమునకు ఎట్టి ఆర్థికాభివృద్ధియు కాజాలదు. ఇందులకు మూడు మార్గములు కనిపించుచున్నవి. 1. శాసన రూపముగ పర్మనెంటు సెటిల్‌మెంటును రద్దుపరచి ప్రభుత్వము జమీందారీలను స్వాధీనపరచుకొనుట 2. లేక ఆస్ట్రేలియా దేశములోవలె జమీందారీలను కొనివైచుట 3. ప్రస్తుత యెస్టేటు ల్యాండు చట్టమును దేశక్షేమ పరముగా దృక్పథమునందున విధానమునందును మార్చుట.'' (పుట 34)

ఎందరో ఈ జమీందారీ విధానమునందలి చెడుగులను సంస్కరించ ప్రయత్నించారు. కాని ప్రయోజనము శూన్యము.

రివెన్యూమెంబరు ఫోర్బ్సుగారు ల్యాండు యాక్టుద్వారా రైతుకు లాభంచెయ్యాలని ఎన్నో ఆలోచనలుచేశారు. జమీందారులు సాగనిస్తేగా! ఆయన ఆలోచనలోని శతాంశమే ల్యాండుయాక్టు. ఆ ల్యాండు

యాక్టు ప్రయోజనంకూడా దరిద్రపురైతు ఎంతవరకు పొందుచున్నాడు? ల్యాండు యాక్టు మార్చి రైతునకు క్షేమము కలుగజెయ్యాలన్న ముని స్వామి నాయునకు ముప్పు మొదటికే తెచ్చారు. స్వామీ వెంకటాచలం శెట్టి, పట్నాయక్ మొదలుగాగల శాసనసభ్యులు దాని సవరణకై పలు విధముల ప్రయత్నించిరి. కాని ఫలితము మనకేదీ? కాంగ్రెసుమంత్రుల కాలములో ఈ కష్టనివారణకై కమిటీఏర్పడింది. ప్రకాశంగారు పట్టుదలతో ప్రయత్నించారు. ఆ వృద్ధకేసరిని నానా ముఖముల మార్కొన్నారు మన విరోధులు, విభీషణాయులూ! పడ్డశ్రమకు ఫలితందక్కిందని కాదు. అసలు యాక్టు సవరణ చెయ్యటమేమిటి? వీరివల్ల ప్రజలకు ప్రయోజనము లేకపోవుటేగాక ప్రమాదం. కాన జమీందారీ పద్ధతి పూర్తిగా పోవాలి. మన మద్రాసుకమిటీలోని కొందరు ఈ జమీందారీలను రద్దుచేసి వారికి తగు పరిహార మివ్వాలన్నారు. ఇది అన్యాయం. వారు ఈ జమీందారీలను తమ ప్రయోజకత్వంవల్ల సంపాయించలేదు. స్వంతధనముచే గడించనూలేదు. ప్రభుత్వమువారి శాసనమువల్ల వీరు జమీందారులైరి. తిరిగి ఆ ప్రభుత్వముమే నేడు ఈ పద్ధతిని రద్దుచేస్తే వారికి ప్రతిఫలమేల యివ్వవలెను? కాన ప్రతిఫల రహితంగా ఈ జమీందారీ పద్ధతి రద్దే ధర్మము, న్యాయమూ. ప్రజలకూ, ప్రభుత్వమునకూ ప్రయోజన కరము.

## జమీందారీ విధానము - బ్రహ్మయ్య

[శ్రీయుత గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, సుప్రసిద్ధ కాంగ్రెసువాది. ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెస్ సంఘమునకు కార్యదర్శిగా పనిచేసిన రైతు బిడ్డ. ఇంతేకాదు. అసలైన జమీందారీరైతు. స్వానుభవముతో కూడు సన్న ఆయనమాటలివి :]

"ఇద్దరు యజమానులను యేకకాలమందు కొల్చుసేవకునిగనో, ఇద్దరుభర్తలతో కాపురముచేయు భార్యగనో యీజమీన్ రైతునుపోల్చ వచ్చును.

ప్రభుత్వాలు రెండు, విధానాలు రెండు. యిద్దరు వుద్యోగీయుల ఆగ్రహానుగ్రహములకు పాత్రుడై మెలంగవలయును. ఇతనికోర్కెలు తీర్చువారు మాత్రము కానరారు. వీరిరోదనలు అరణ్యరోదనలు.

పంటలుపండినను, పండకపోయినను, శిస్తులు అమ్మవారి ముడుపు వలె యిచ్చుకొనవలశినదే. యీ శిస్తులమొత్తములు, సామాన్యములా? ప్రభుత్వపు శిస్తులకు యెన్నోరెట్లుహెచ్చు. యివిగాక అక్రమపుసెస్సులు, ఇన్‌కంటాక్సులు, కంచెలపైనిల్యాండు సెస్సులు యింక ఎన్నో. పంట కాల్వలు, చెఱువుల మరమ్మతునుగూర్చిగాని, మురుగుకాల్వల సౌకర్య మునుగూర్చిగాని నోరెత్తరాదు.

విద్యవలన వివేకము కలుగునందురు. జమీందార్లలో విద్యా వంతులుకలరే! అయినను అయ్యది వీరికి వర్తించదేమో! రయితుల కష్ట ముల గమనించి వర్తిచువారొకరైన కానరారు.

రయితు రక్తమును పన్నులమూలముగా గుంజి వీరుచేయు ఖర్చు లెవ్వి? ఒకరికి కుక్కలయందుమోజు, మరొకరికి పుంజులయందు, వేరొక రికి గుఱ్ఱములయందు, మరొక్కనికి మేళతాళములయందు, ఆటపాటల యందు, సినీమాస్టారునందు, విందు వినోదాలయందు. పోలోఆటలకు, గిండిరేసులకు, ముస్తాబుగానివారు అరుదు. వీట్లకై వీరు వ్యయమొనర్చు లక్షుల ధనము ప్రజల రక్తమాంసములనుండి వసూలుచేసినదేకదా?

భారతదేశమునం దంతటను, జమీంధ్దార్లు యీ బైనాలుగుకోట్ల ప్రజాధనమును, యీవిధముగ దుబారాచేయుచుండ, దేశము సుభిక్షముగ నెట్లుండగలదు? యీజమీందారీపద్ధతి పూర్తిగ రద్దుకావలెను.''

తాడేపల్లిగూడెములో 1936 సం॥ నవంబరు 26 వ తేదీని జరి గిన రైతుమహాసభ ఆధ్యక్షోపన్యాసము నందలి కొన్ని మచ్చుతునకలు.

రైతు మేలుకొక్క రాగిదమ్మిడైనా
ఖర్చుచేయగ బూనుకోరు
దుఃఖకరము చెప్తే వీరితీరు
పోలోఆటలకు ధారబోస్తారు
ప్రజలడబ్బుని వీరు పరిగణించగబోరు
మాకొద్దీజమీందార్ల పొందు,"

నెల్లూరి వెంకట్రామానాయుడు

## జమీందారీ విధానము - జవహరిలాల్ నెహ్రూ

[ప్రపంచ విఖ్యాతుడును, యువకనాయకాగ్రణియు రైతు బాంధవుడు నగు జవహరిలాల్ గారు, 'మన రైతుసమస్య' అను హిందీ గ్రంథమునకు భూమికలో యిటులవ్రాసిరి.]

"నేడు భారతదేశమునందలి ముఖ్యసమస్య రైతుజమీందార్లదై యున్నది. అనగా భూసంబంధమున ఎట్టిచట్టమును చేయవలెను ? దానికి గామందెవరు? జమీందారే యజమానై, రైతులచే ఊడిగముచేయించు కొని ప్రయోజనము పొందుటా, లేక పొలములో ప్రొద్దస్తమానము పని చేయు రైతాయజమాని? కాకపోతే అది ప్రజలందరిసొత్తని తలచవలెనా? ఈసమస్య పరిష్కారమగుచో కోట్లకొలది మన సోదర సోదరీ మణుల జీవితములలో అత్యధికమగు మార్పుకలుగును. ఈమహత్తరసమస్య ముందు మన యితరసమస్యలన్నియు అల్పములు. మనదారిద్ర్యము ఇందులో ఇమిడియున్నది. ఇందుచే దీనినిగురించి మనము దీర్ఘముగ ఆలోచించవలయును.

దీనావస్థనందున్న రైతునకు శుష్కసానుభూతిచూపుట మనకనుచితము. వారి వ్యాధిఏమిటో, దానికి తగినమందేమిటో, తెలిసికొనవల

సినబాధ్యత మనయందున్నది. నేడు హిందూదేశమునందలి పల్లె-పల్లె గగ్గోలుపెట్టుచున్నది. దారిద్ర్యము, నిరాహారము, నిరుద్యోగముల నే వ్యాధులు ప్రజలను పట్టిపీడించుచున్నవి. వీటిని నివారించు టెట్లు ?

జమీందారీ విధానమును రూపుమాపుటే సర్వరోగ నివారిణి అని తరుచుగా జనులు చెప్పుచున్నారు. నాఅభిప్రాయముకూడా అదే.''

అన్యాయకాలంబు దాపురించిరిపుడు
అందరము మేలుకోవాలండి
మాన్యాలు భోగాలు మనుజులందరి కబ్బు
మార్గాలు వెతకాలి రారండి !

గరిమెళ్ల సత్యనారాయణ.

## జమీందారీ విధానము : జయప్రకాశ నారాయణ

[జయప్రకాశ నారాయణగారు అఖిలభారత కాంగ్రెసు కార్య నిర్వాహకసభ్యుడు, సోషలిస్టుపార్టీ కార్యదర్శి.]

''జమీందార్లు, భూస్వాములు భారతదేశంలోని మధ్య యుగము నాటి పరిస్థితులకు శేషభాగాలు. ఆధునికప్రపంచంలో వారు వుండాలని ఊహించడానికికూడా వీలులేదు. సామ్రాజ్యప్రభుత్వం తనస్వలాభానికే వీరిని నిలువబెట్టి సంరక్షిస్తూంది. లేకుంటే ఆధునిక సామాజిక శక్తులు ఇదివరకే వీరిని నాశనంచేసిఉండేవి......జమీందారీపద్ధతిలో జరిగే దురన్యాయాలను మాత్రమే మనం ఎదిరించడంలేదు. జమీందారీ పద్ధతి నాశనంచేయాలని అంటున్నాం. హిందూసమాజంలో భూస్వామ్యం ఎప్పుడూ ఉండలేదు. భారతదేశచరిత్ర చదివితే, హిందూమహాయుగంలో భూమిని సేద్యంచేసే రైతు రాజునకుగాని, రాజోద్యోగులకుగాని తన ఆదాయంలో ఒకనిర్దిష్టభాగాన్ని పన్నుగా చెల్లించేవాడు. అంతేగాని ఈమాదిరి మధ్యవర్తులెన్నడూ లేరు.

జమీందారీలను తొలగించాలని మనం చెప్పేటప్పుడు బోల్షివిక్ పద్ధతుల్ని అనుకరిస్తున్నామనీ, మన ప్రాచీన నాగరికతను సాంప్రదాయాలను మరచిపోతున్నామనీ, మన ప్రతిపక్షులు చెప్పుతూ ఉంటారు. ఇది ఎంతఅర్థంలేనివాదమో స్పష్టంగా తెలవడంలేదు ?

భూస్వామ్యపద్ధతివలన కలిగే లాభా లేమయినా ఉన్నవేమో ఆలోచించుదాం. సోమరితనం, బాధ్యతలేకపోవడం, పోకిరీతనం తప్ప భూస్వామ్యపద్ధతి తెచ్చిపెట్టే మంచిలక్షణా. లేమున్నాయి ? ఈ పద్ధతి వలన రాజ్యాంగానికి ప్రజలకీ కూడా నష్టమే. సమాజానికి ఏ విధంగాను ఉపకరించని ఈ దళారీవర్గం ఉత్పత్తిలో అధికభాగాన్ని అపహరిస్తుంది. ఈ భాగంకూడా న్యాయంగా రైతుకే చెందాలి కదా ?

సోషలిజంయొక్క వాసనకూడా ఎరుగని 'డార్లింగ్' అనే అతడు పంజాబులోని భూస్వాముల్నిగురించి ఈ విధంగా వ్రాశాడు.

"ఈ రాష్ట్రాన్నంతను పరిశీలిస్తే వడ్డీ వ్యాపారుల కన్న, భూస్వాములే సమాజానికి ఎక్కువ పీడాకరంగా ఉన్నారు. వడ్డీవ్యాపారి పీడాకరుడేగాని అతని స్థానంలో మరియొకపద్ధతి ప్రవేశ పెట్టబడే వరకు అతడు తప్పని సరియైనబాధయే. ఇంక. భూస్వామి అంటారా? అతడు రైతుల రక్త మాంసాలపై బ్రతుకు పరభాగ్యోపజీవి. ఇంతే కాదు. అతడు తన ఆదాయాన్నంతనీ దుర్వినియోగ పరుస్తూ ఇరుగు పొరుగు జనులనుకూడా పాడుచేస్తున్నాడు..........."

ఈ పద్ధతిలోనున్న అత్యాచారములే గాదు. ఈ పద్ధతి ఉండకమే సమాజానికి బాధ. భూమియే ఉత్పత్తికి ప్రథమసాధనం. భారత దేశంలో ముఖ్యజీవన సాధనంకూడా భూమే. అట్టి భూమిపై వ్యక్తులు ప్రత్యేకాధికారం కలిగిఉండడం దోపిడీపద్ధతిని హెచ్చుచేయడమే. ఆర్థిక అసమానత్వాన్ని ప్రోత్సాహపరచడమే. అంతేకాదు. ఈ భారతదేశంలోని ప్రజలలో అధికభాగాన్ని క్రమంగా దారిద్ర్యంలోముంచి వారిని కృంగదీసి వేస్తూంది.

భారతదేశంలో వ్యవసాయపు పరిశ్రమకుగల అభ్యంతరాలు చాలా పెరిగిపోయినాయి. అందుచేత దానిలో సంపూర్ణమైన మార్పుతీసుకొని వస్తేనేగాని అది బాగుపడడం అసంభవము. దానికొక్కటే మార్గం. భూమిని దున్నేవారిని, దోపిడి చేస్తూన్న భూస్వామ్యపద్ధతిని నిర్మూలించడమే.'' (సోషలిజం యెందుకు? పుటలు 74—77.)

## జమీందారీ విధానము - యం. యన్. రాయ్.

[రాయ్ ప్రపంచ విఖ్యాతుడైన రాజకీయవేత్త. ఆయన తన సునిశిత బుద్ధితో యీ విధానాన్ని ఇలా వివరించాడు.]

''స్వయంగా సాగుచేయనిభూమి ఒకటివుండి సాగుచేయక రైతుల కిచ్చి వారికి అందులో .మిగిలే ఫలసాయన్ని అంతా అపహరించేవాణ్ణి, జమీందారు అనవచ్చు.

జమీందారివిధానమంటే అసలుత్పత్తికి కారకుడైనవాడికి మిగిలే ఫలసాయాన్ని (సరప్లస్ ఉత్పత్తి) కొంచెముకూడ మిగలకుండా దోచుకునే ఆర్థికవిధానం.

జమీందారీ ఆర్థికవిధానం సామాజికఅభివృద్ధికి ఆటంక పడుతుంది. సమాజపోషణకు అన్నివిధాల కావలసినదానికంటె ఎక్కువగా నుత్పత్తి చేయడానికి మిగిలే ఫలసాయాన్ని (సర్ప్లస్ ఉత్పత్తి) వినియోగించనప్పుడు ఆర్థికవిధానం కుళ్ళుతూ వుంటుంది. జమీందారు రైతు దగ్గరనుంచి వసూలుచేసి దాన్ని వ్యవసాయాభివృద్ధికి కావలసిన కాలువలు, ఆనకట్టలు వగైరాలకు వినియోగిస్తూ వుంటే, సామాజిక అభివృద్ధికి పాటుపడట మౌతుంది. కాని జమీందారీ ఆర్థికవిధానంలో యిలాంటిది జరుగదు. ప్రతి సంవత్సరం మిగిలే ఫలసాయన్ని వసూలుచేసి, జమీందారులు ఇంకా ఉత్పత్తి చేయటానికి వినియోగించరు. ఇలా వచ్చే ఆదాయాన్ని తామే మ్రింగివేసి, సామాజిక అభివృద్ధినే అరికడుతూ ఉంటారు. అందువల్ల ఒకదశలో జమీందారి విధానాన్ని కూలద్రోయ

వలసిన అవసరం వస్తుంది. క్రొత్తపంథా క్రొక్కి ఉత్పత్తిని సాగించే టందుకు, దానిద్వారా సామాజిక్ అభివృద్ధి చేకూర్చడానికి యిలాంటి పరిస్థితి అవసరం. కేవలం రైతులకే కాక తతిమ్మా సమాజానికి కూడా ఇలా అభివృద్ధికి ఆటంకకరంగా యున్న జమీందారీ వర్గాన్ని కూలద్రోయవలసిన అవసరం వస్తుంది.

ఒకవర్గానికి, మరొకవర్గానికి శత్రుత్వమున్నంతమాత్రాన రెండో వర్గం నాశనం చేయబడదు.

ఒకవర్గం తతిమ్మావర్గాల అభివృద్ధికి అడ్డుతగిలేటప్పుడు నాశనం చేయబడుతుంది.'' (పుటలు 20, 21 వర్గసంబంధాలు.)

మరి జమీందారీ వర్గం రైతువర్గాన్ని పీడించుటేగాక ఇతర వర్గాల అభివృద్ధికికూడా ఆటంకకరంగా వున్నదని రాయ్‌గారు చెప్పిన తరువాతకూడా రాళ్లులాగా చలనం లేకుండావుంటే ప్రయోజనమేమిటి?

అంతాకలసి ప్రయత్నించుదాం రండి, జమీందారులనుకాదు, జమీందారి విధానాన్ని కూలద్రోయుటకు. ''బలవంతమైన సర్పము చలిచీమలచేతజిక్కి చావదే!'' అవునా కాదా!

ఇంకా ఆలోచనెందుకు, ఆలస్యం అమృతం విషం!

## జమీందారీవిధానము: స్వామీ సహజానంద

[సహజానంద బీహారు ప్రాంతీయుడు. ఈయన సన్యసించి రైతు శ్రేయస్సుకై పాటుపడుచున్న రయితునాయికుడు. మనప్రాంతాలకు రంగాగారెట్టివారో ఆ ప్రాంతాలకు వీరును అట్టివారే. జమీందారీ రయితుల దుర్భర పరిస్థితులు మార్చుటకు జమీందారీపద్ధతి రద్దుతప్ప పరొకమార్గములేదని ''జమీందారీలు ఏల రద్దుకావాలి?'' అను వారి చననుండి యీ దిగువభాగములు ఉదహరించుచున్నాను.]

''జమీందారీలు ఏర్పరచటంలో బ్రిటిష్‌ప్రభుత్వపు స్వార్థం అనేకవిధాల సాఫల్యమైంది. ఒకటి: మనదేశపు పెట్టుబడి అంతా

వ్యాపారమునందు పెట్టకుండా, భూమిమీద వుంచబడినది. ఈవిధముగా విదేశవ్యాపారానికి ఇక్కడ తగినంత అవకాశము చిక్కింది. రెండవది: ప్రభుత్వానికి, ప్రజలకుమధ్య ఒక ఎత్తయినగోడ ఏర్పడింది. దానివెనుక నుండి ప్రభుత్వం తనపని చేసుకుంటూవుంది. జనసామాన్యం త్వరగా దానిని చూడలేకపోయింది. అందుకని దానిమీద ఆక్రమణకూడా చేయ లేకపోయింది. ప్రతిబంధకాలు, నిర్బంధాలు జమీందారులద్వారా జరుగుతూ వుండేవి. ప్రభుత్వచట్టానికి విరుద్ధముగా, బహిరంగంగా పనిచెయ్యటం తేలికగాదు. కాని వారిమిత్రులు, ఏజెంట్లూ అయిన ఈ జమీందారులు అంతా చేస్తూవుండేవారు, చేస్తున్నారుకూడా. ఈ విధంగా దేశంలో పరస్పర విరుద్ధమైన రెండుస్వార్థాలు ఉత్పన్నమయ్యాయి. దానితోపాటు జమీందారీయంత్రాలు నూటికి 80 నుండి 90 మంది వరకు రయితుల నిర్వీర్యముగను, పిరికిపందలుగను చేసినాయి. ఇంకా ప్రభుత్వాన్ని ధిక్కరించేది ఎవరు? జమీందారులు రయితులను ఏవిధముగా ఘోరహత్యలు చేస్తున్నారో వార్తాపత్రికలలో, కరపత్రాలలో, పుస్తకాలలో చదివితేను, ఎసెంబ్లీచర్చలలో వింటేను చాలదు. దహించుకుపోతున్న రయితుల కంటికి మంటికి ఏకధారగా ప్రవహించు వారి కన్నీటికాల్వలు వారిస్థితిగతులను చెప్పగలవు. అదికూడా హృదయమున్నవారికే. వారినిట్టూర్పులు, మూకవేదనలు, తెలుసుకోగలిగిన వారికే.

ఇంగ్లీషుప్రభుత్వంతో పోట్లాడేవారు, పోట్లాడతలచేవారు జమీందారులకు విరుద్ధంగా ఆందోళనచెయ్యటానికి ఎందుకు వెనక ముందాడుతున్నారో అర్థం కావటంలేదు. పల్లెటూళ్లలో ఆంగ్లప్రభుత్వము కంటికి కనపడనే కనపడదు. అక్కడ కనపడేదల్లా జమీందారీప్రభుత్వం. అది రయితాంగాన్ని, తదితర దరిద్రప్రజని అనేకవిధాల దోచుకుని పలుబాధలు పెట్టుతూవున్నది. కనుక యీ జమీందారీ శత్రువును అతడు స్పష్టముగా ఎరుగును. నిరంతరము బాధించు శత్రువుతో పోరాడక

పోవుటయేగాక వానితో మైత్రిగలిగి మెలగమని చెప్పుతూ, కార్మిక, కర్షకులకు చెందిన జీవితములో సంబంధములేని శత్రువుతో పోట్లాడ మని వారితో చెపితే వారికి మనము చెప్పేది అర్థంకాక ఆశ్చర్యాన్వితు లగుదురు.

జమీందారీవిధానం పాచిపీనుగులాంటిది. దానిని దగ్ధంచేయనంత వరకు దానినుండి ఎడతెగకుండా దుర్వాసన వస్తూనేవుంటుంది. వ్యాధులు వస్తూనే వుంటాయి. కనుక మన ప్రథమకర్తవ్యము దానిని తుదముట్టిం చుటే!

స్వరాజ్యమువస్తే వాటంతటవే సమసిపోతవనేవి మనకు కళ్లల్లో తాల్చినదుమ్ము కొట్టడమన్నమాట. ప్రపంచములో అన్నిదేశాలు స్వతం త్రత పొందినాయి. కాని రష్యాలో తప్ప మిగిలినదేశాలన్నిటిలోను యీ సంఘర్షణలన్నీ రోజు, రోజూ వృద్ధిపొందుతూనే వున్నాయి. స్వరాజ్యం వచ్చినతర్వాతకూడా జమీందార్లు, షాహుకార్లు, పెట్టుబడిదార్లువుంటే ఆ స్వరాజ్యం బీదలకు ఒక దమ్మిడీకికూడా పనికిరాదు. పకీరులు, సన్యా సులు చెప్పే స్వర్గానికిగాని, వైకుంఠానికిగాని, రయితాంగము, తదితర బీదప్రజలు పోవుటకు ఇచ్ఛగించేకారణం అక్కడ యీ జమీందార్లు, వడ్డీవ్యాపారస్తులు వుండరని. వీరుకూడా అక్కడికే వస్తారంటే, అసలు ఆ రయితాంగం అక్కడ కాలుపెట్టనేపెట్టదు. జమీందారు లేకపోతే నరకానికికూడా పోవటానికి వారు ఎంతమాత్రము సంకోచించరు.

ఆకలి మంటతో అల్లలాడుతున్న రయితుల భూములు ప్రతిరోజు జమీందారులవల్ల, షాహుకారులవల్ల వేలాలు పడి పోతూవుంటే, వారి పిల్లా-జల్లా కూడూ-గుడ్డా, మందూ-మాకూ లేక మలమల మాడిపోతూవుం టే, అట్టి రయితాంగాన్ని దేశస్వాతంత్ర్య పోరాటములో చేరకోరు వారు ఆవివేకులనుటలో అతిశయోక్తిలేదు. ఆకలిగొన్నవాడు భగవంతుని, సత్యాగ్రహాన్ని మరచిపోవును. వానికి అన్నపు సంగతి మినహా అన్య ఆలోచన రానేరాదు. అప్రియసత్యమిది. కిసాన్ ఆందోళన యీ ఆకలి

మంటలార్చుటకే. మనము దీనిద్వారా జమీందార్ల నుండి, షాహుకార్ల నుండి, రయితుల బాధల నివారించి కొ_స్త వారిని కోలుకోనివ్వ కోరాలి. ఈవిధముగా వారికి సహాయముచేసి, వారికి విశ్వాసము కలుగజేసి, అనంతరం వారికి నాయకత్వం వహించి స్వతంత్ర పోరాటానికి సంసిద్ధులు చేతాము.

ఈ జమీందారులు మన రయితాంగాన్ని అనేక విధాల అక్రమ పన్నులద్వారా శోషింపజేయుచున్నారు. వాటిపేర్లన్నీ చెప్పుటకు యిచ్చుట తావు చాలదు. ఇంతటితో ఊరుకోక వారితో వెట్టి చేయించుకుంటారు. కొంతమంది పేరుకు ఏదో కొంత ప్రతిఫలముగా కొన్ని దమ్మిడీలు పారవేస్తారు. ఈ జమీందార్లేగాక వీరి నౌకర్లు-చాకర్లు చేసే దౌర్జన్యాలకు అంతున్నదా ? వీళ్లకు ధాన్యం, కూరగాయలు, గడ్డా, గోచి, పాలు, పెరుగు, నెయ్యి, కోళ్లు, కొక్కి_రాయిలు, గుడ్లు, గొర్రెలు, మేకలు, ఇంకా ఎన్నో చెప్పజాలనన్ని యిచ్చుకోవాలి. రయితాంగం బ్రతకాలంటే నేడు జమీందారీ విధానము అంతం చెయ్యాలంటే అర్థం రయితులకు, ప్రభుత్వానికి మధ్య రయితులనుండి పన్ను వసూలుచేసి కొంత తాము మ్రింగి, కొంత ప్రభుత్వానికిచ్చే దళారులు పోవాలన్న మాట. ఇది మన ప్రస్తుత క_ర్తవ్యము.''

"ఎస్టేటు రై_తుకిక నేముందిరా బాబూ
కష్టాలలోపలనే నష్టాలు గలిగె
ఇష్టమొ_స్తే పన్ను హెచ్చించుతారండి
కష్టమైనా బెట్టి కక్కు_మంటారు
హెచ్చుచేసిన పన్ను యేనాడు తగ్గదిక
వచ్చుబడి యోజించువారు లేరండి
పంటనష్టం యెంచి పన్నాపు చేస్తారా ?
కంట నీళ్లను బెటితె కనికరిస్తారా ?"

# జమీందారీవిధానము - లాసన్

[సి. పి. లాసన్‌గారు కలకత్తా యూరోపియన్ అసోసియేషన్‌కి అధ్యక్షుడు. వాణిజ్యసభ్యుడు. వ్యాపార రహస్యాలు తెలిసినవాడు. భారతదేశ ఆర్థికవిధానాన్ని యేవిధంగా బ్రిటీషువ్యాపారసంఘం మార్చాలనుకుంటుందో రాయల్ ఏషియాటిక్ సొసైటీ (Royal Asiatic Society) లో బెంగాలుశాఖలో ఇటీవలనే ఆయన చదివిన వ్యాసములోని అవసరమగు భాగములనుమాత్రమే ఉదహరిస్తున్నాను.]

"భారతదేశంలో మొట్టమొదట జరగవలసినమార్పు, వ్యవసాయంలో నూతనపద్ధతులు ప్రవేశపెట్టి యెక్కువ వుత్పత్తిచేయించాలి. రయితుజీవిత పరిమాణం హెచ్చించాలి. ఇప్పుడు ప్రతిచోట దేశంలో పరిశ్రమలు హెచ్చించాలి" అనే నినాదం వినబడుతుంది. కాని పరిశ్రమలంటే యే పరిశ్రమలు ? వాటిని యేవిధంగా అభివృద్ధిచేయాలి ? అనే వాదోపవాదాలు చాలా తక్కువగా వినబడుతున్నవి. నా వుద్దేశం ప్రకారం ఒకదేశసౌభాగ్యం ఆదేశ వుత్పత్తినిబట్టి నిర్ణయించటానికి వల్లేదు. వుత్పత్తి అవుతున్నసరుకులు ఆ దేశంలో వినియోగంకోసం ఖర్చు అవుతున్నదాన్నిబట్టి దేశసౌభాగ్యం ఆధారపడివుంటుందని నా వుద్దేశం.

ఈ దృష్టితో యిండియాపరిస్థితులు ఆలోచించండి. ఇండియాలో వ్యవసాయం ముఖ్య పరిశ్రమగా పరిగణించబడుతుంది. వ్యవసాయంలో నూతనపద్ధతులు ప్రవేశపెట్టి ఇప్పటికంటె రెట్టింపు మూడింతలు పండించగలిగినప్పుడే దేశం బాగుపడుతుంది; అంటే ఆ యెక్కువపంట వ్యవసాయంచేసే రయితులకు చెందేటట్లు వుండాలి. రయితుల్లో జీవిత పరిమాణం హెచ్చించాలి. దీనివల్ల రయితుసంఘం బాగుపడి, బాగుపడిన రయితుయితరవస్తువులుకూడా కొనేస్థితిలో వుండును. కాబట్టి యితరపరిశ్రమలుకూడా అభివృద్ధిచెందుటకు వీలుంది.

శాస్త్రజ్ఞులు తెల్పిన లెక్కలనుబట్టి యిండియాలో పండే పంటలు సరిగ్గా పండి, పరిస్థితులు యిప్పటిలా కాకుండా శాంతియుతంగా వుంటే, సంవత్సరం మొత్తంమీద తింటానికి కావలసినంత అందరికి పంచి పెడ్తే, 5 కోట్ల మందికి అన్నం అసలే వుండదు. కనుక మొట్టమొదటగా చేయవలసిన పని సాగుకు వీలైన భూప్రదేశాన్నంతా సాగుచేయాలి. ప్రజలకు తిండి చూపించాలి. రెండోది : భూమిమీద యిప్పటివరకున్న పాత హక్కుల్ని తొలగించి కొత్త హక్కులు కలుగ చెయ్యాలి. ఇప్పుడు వ్యవసాయం చేసేది ఎవరైనా భూమిమీద ఒక వ్యక్తికి అతని వంశ పారంపర్యంగా హక్కు వుండుటచేత ఫలసాయమంతా ఆ వ్యక్తికే సంక్రమిస్తుంది. రైతుకి రోజు కూలి తప్ప అధికంగా ప్రతిఫలం ఆవగింజంతైనా లభించుటలేదు. కనుక రైతుకి అతని పొలంమీద అతనికి హక్కు కలిగించి వచ్చే ఫలసాయం అతని జీవితానికి కుటుంబానికి చెందేటట్లు చెయ్యాలి. రైతుకు యీ హక్కు యేర్పరచినప్పుడే, పొలంమీద అతనికి శ్రద్ధ కలుగుతుంది. ఎక్కువ పండిస్తాడు. పండినదంతా అతనికే చెందితే దానివల్ల తాను, కుటుంబం బాగుపడడానికి, జీవిత పరిమాణం హెచ్చటానికి, పిల్లలకు చదువు చెప్పించి విజ్ఞానవంతులుగా చెయ్యటానికి వీలుంటుంది.

భూ విధానంలో యిలాంటి మార్పులు చేయటానికి ప్రయత్నిస్తే భూస్వాములు తప్పకుండా ప్రతిఘటిస్తారు. వారు యెదురు తిరుగుతారన్నే భయంతో ప్రభుత్వం మెదలకుండావుంటే, కోట్లకొలది రైతులు దారిద్ర్యంలో నాశనం కావలసివస్తుంది. రైతు శ్రేయస్సుకోసం ప్రభుత్వం కృషి చేయటానికి పూనుకుంటే భూస్వాములు ఎదురుతిరిగినా ఏమీ చేయలేరు. రైతులంతా ప్రభుత్వానికి అండ అగుతారు. తమకు లాభం చేకూర్చే ప్రభుత్వానికి తమ ప్రాణాలివ్వటానికైనా సిద్ధపడతారు.

నేడు రష్యా ప్రభుత్వం, ప్రపంచంలో పెద్ద మిలిటరీ శ సంపాదించిన జర్మనీ దెబ్బకు తట్టుకొని తిరిగి దెబ్బ కొడుతున్నద

యిందుకు కారణం ఆ ప్రభుత్వ విధానమే. సమిష్టి వ్యవసాయంవల్ల అచ్చటి రైతులకు మేలు కలిగింది. యీ విధానాన్ని నాశనం చేయటానికి పూనుకొన్న జర్మనీ మిలిటరీ శక్తిని తమ ప్రాణాలైనా యిచ్చి రష్యా రైతులు యెదుర్కొంటున్నారు. కాని తమ సమిష్టి వ్యవసాయాన్ని విడిచిపెట్టడానికి ఒప్పుకొనుటలేదు.

కనుక మొట్టమొదట నూతన పద్ధతుల్ని ప్రవేశపెట్టేటప్పుడు కొన్ని అవాంతరాల్ని యెదుర్కోవలసివచ్చినా, భావిభారత ప్రజానీక శ్రేయస్సుకోసం యీ మార్పులు జరగడం అవసరం. భారతదేశంలో యేదైనా మార్పులు జరగాలంటే మొట్టమొదటగా జరగవలసిన మార్పు రైతు జీవితాన్ని సుఖవంతం చేయటం. ఇంతవరకు కేంద్ర ప్రభుత్వం రాష్ట్రీయ ప్రభుత్వాలు కలిసి వ్యవసాయానికి, దేశానికి వెన్నెముకలాంటి రైతు ఒక్కొంటికి అణా కాని చొప్పున మాత్రమే ఖర్చుపెట్టుతుంది. భావికాలంలోకూడా రైతుని యీ స్థితినే వుంచి ఇతర మార్పులుకోసం ప్రయత్నించడం వ్యర్థం. వ్యవసాయాన్ని సక్రమంగా నడిపి పంటలు సమృద్ధిగా పండించగలిగినపుడే తక్కిన మార్పులు జరగటానికి దేశం బాగుపడటానికి అవకాశం వుంది.''

ఈ జమీందారీ విధానం మొట్టమొదట విదేశవర్తకుల లాభం కొరకే సృష్టింపబడినది యీస్టిండియా కంపెనీ కాలములో. యీ బ్రిటిషు ప్రభుత్వము నేడో రేపో తిరిగి బ్రిటిషు వర్తకుల లాభంకొరకు యీ దత్తపుత్రులగు జమీందారులను సాగనంపాలని లాసన్‌గారు చెప్పారు రైతు శ్రేయస్సు కని. ఇందులో ఐతే, వీరి శ్రేయస్సు ఇమిడి వున్నదని విడబరచి చెప్పాలా వివేకవంతులకు?

ఆ మహానుభావుడు యీ మహారాజులకు మనోవృత్తి యేమన్నా యివ్వాలంటాడా? తిన్నదే చాలంటాడా? అదే అన్నాడు అరమర లేకుండా. అవసరమైతే అడిగి చూడండి. అందుబాటులోనే వున్నాడు. అందుకు సందేహమా?

నూతన రాజప్రతినిధి అగు వేవెల్ ప్రభువు, యుద్ధంలో శత్రువులను చెండాడి, అనంతరం వ్యవసాయ విధానంలో ప్రచండ మార్పులు తెస్తానంటాడు. ఆ మార్పులో జమీందారీ పద్ధతి రద్దుకూడా వుందా? లేక లిన్‌లిత్గో ప్రభువు ఆబోతును ఒకదాన్ని పోసి, నేను రైతుకు చాలా సహాయం చేశానని ఆత్మవంచన చేసుకొన్న వైస్రాయివలె చేయడుకద కొంపదీసి మన మిలిటరీ వైస్రాయికూడా? భూస్వామి విధానంలో మార్పులేని మన వ్యవసాయ విధానమార్పు పునాదిలేని సౌధము. ఎవరేమనుకొన్నా, అనుకోకపోయినా ప్రపంచ పరిస్థితులన్నీ ఆలోచిస్తే, యీ పరభాగ్యోపజీవులు పెందలకడ మేల్కొని జాగ్రత్తపడి 'బ్రతుకు జీవుడా' అని వేరే మార్గం ఆలోచించుకోక తప్పదు. వారి సంగతెందుకు గాని, రైతు రాజ్యం చేరువులో నున్నదని చెప్పక చెప్పతూంది. కాల మానాన్ని కాదనగలరా కళ్లున్నవారు.

నేటి పిఠాపురపు రాజాగారి తండ్రి వీరు కలగనప్పుడు దత్తత చేసుకొన్నాడు మరొకరిని. వీరు కలిగిన తర్వాత ఆ దత్తుని సాగనంపితే యీ పుత్రుడు అసలు పుత్రుడు కాదు, నా దత్తత చెడగొట్టటానికి పన్నిన మిష కాని అని నెత్తీ, నోరు కొట్టుకొని గోలచేశాడు ఆ దత్తుడు.

ఆ మహారాజు యీ అబ్బాయి నా కొడుకంటె కాదనటానికి నీ వెవ్వరోయి ? ఆయన రమ్మంటే వొచ్చావు పొమ్మంటే పో, అన్నారు కోర్టువారు.........

అలాగే బ్రిటీషువారు యీ జమీందారులను దత్తపుత్రులుగా భావించారు. వారు పొమ్మంటే వీరు మా పరమనెంటు మాటేమిటంటే పిఠాపురపు తీర్పే ఖాయమంటారు, ఆంగ్లరాజనీతిజ్ఞులు. అవునా కాదా? అదెంత దూరం! కోసెడుకోసెడు దూరమా! కాదు కను చూపుమేరలోనే కాసుకోండి, చూసుకోండి నా జోస్యం!

# జమీందారీ విధానము—కృష్ణా పత్రిక

[కృష్ణాపత్రిక ఆంధ్రదేశమున 40 సం॥ల నుంచి ప్రజామన్నన పొందుచున్న పత్రిక. ఆ పత్రిక దూరదృష్టిని గమనించుడి.]

"ఈ జమీందారీపద్ధతి యీ కాలమునకు సర్వవిధముల అనర్థదాయకమని ఒప్పుకొనక తప్పదు. ఒకకాలములోన జమీందారీలు దేశీయ కళా శిల్పములను రక్షించి పోషించెడివి. ఇప్పుడు జమీందారీలు దేశమున కెట్టి ప్రయోజనమును గలిగించుటలేదు. పైగా అవి ప్రజల ధనశోషణమునకు దోడ్పడు ప్రబల సాధనములగుచున్నవి. ప్రజాశక్తి విజృంభణమున కడ్డంకులగుచున్నవి. మానవసమాన ప్రతిపత్తి సంస్థాపనమునకు ప్రతిబంధకములగుచున్నవి. సార్వజనీనతను బ్రతిష్ఠింప జూచుచున్న ప్రకృతి యిట్టి జమీందారీపద్ధతి నెట్లు సహించి యూరుకొనగలదు? యుగధర్మమునకనుసరించి, తమ స్వార్థములను జపానులోని 'సమూరేల'వలె విడనాడెదరా, లోకము వారిని స్తుతించును. వారి కేదోవిధముగ ప్రతిఫలము కలుగును. లేదేని జమీందారులకును, రైతులకును స్పర్థతప్పదు.

జమీందారీపద్ధతి అంతమొందించుట ప్రస్తుతపు చట్టములకు, అప్పటి సాంఘిక సంప్రదాయములకు, నేటి ఆర్థికనీతికి విరుద్ధము కావచ్చును. దీనికి ఎక్స్‌ప్రోప్రియేషను అని అనవచ్చును. రష్యాలోని కమ్యూనిజము" క్రింద జమకట్టి, విద్రోహ మనవచ్చును. కాని ఈ చట్టములకంటె, ఈ సంప్రదాయములకంటె, ఈ ఆర్థిక నీతికంటె, మహత్తరమైన సార్వజనీన ధర్మమొకటి రానున్నదని నమ్ముడు. నేడు జరుగుచున్న పరివర్తనములన్నియు నాదిక్కునే సూచించుటలేదా?...

నేడు ప్రపంచమునంతను గలవరపరచుచున్న సమస్యలు చాలవరకు ఆర్థికములు. భూస్వామికి-రైతునకు, యజమానికి-పనివాండ్రకు. వ్యాపారమునకు వ్యాపారమునకు స్పర్థలు రగులుచున్నవి. ఏ ఆర్థిక విధానమువలన నీ స్పర్థలను తొలగించవలసి ఉండునో ప్రజలతోపాటు

జమీందారులుకూడతీవ్రముగ నాలోచించవలసి ఉండును. వారి వెనుకటి చరిత్రలనుబట్టి హక్కులను సమర్థింప జూచుకొనుట నిష్ప్రయోజనము. ఇది ధర్మవిషయముగాని, మానవకల్పితమైన "లా" విచారణ కాదు. ఏ జమీందారుడైన, ఈ రోజులలో "ఇంపార్టిబులు" పద్ధతిని గాని, పర్మనెంటు సెటిల్మెంటునుగాని ధర్మరీత్యా సమర్థించుట అసంభవము. నేడు శాస్త్రములచే గొందరు పూర్వాచార పరాయణులు అస్పృశ్యతను సమర్థింప జూచుచున్నట్లు, జమీందారులు వారి ప్రాత ఒడంబడికలను, సనదులనుబట్టి కోర్టులలో వాదించుకొనవలసినదే కాని, లోకము సమ్ముఖమున, ధర్మదేవతముందు మూకీభావము వహించకతప్పదు. సకల పరివర్తనములకు, సకల వ్యవస్థలకు, బరమ ప్రమాణము ప్రకృతి విధానమగు సమాన ప్రతిపత్తి సంధాయకమైన ప్రజాతంత్రమని ఎంత త్వరగ దెలసికొనిన లోకమున కంత మేలు"!

[కృష్ణా పత్రిక 1936 జూన్ 20]

## రైతుసమస్య _ వివిధదేశములు

ప్రపంచమందలి వివిధ రాజ్యాంగములు రైతుసమస్య నెట్లు పరిష్కరించినవో పరికింతము.

బ్రిటీష్ దీవులు: జనసంఖ్య 5 కోట్లు. యింగ్లాండు వ్యవసాయ ప్రధాన వృత్తిగల దేశముగాదు. అచ్చట నూటికి 10 మంది మాత్రమే రైతులు. అది కార్మికదేశము. ఫ్యాక్టరీలపై ఆ దేశపు ఆర్థిక స్థితి ఆధారపడియున్నది. అచ్చటిసమస్య కార్మికసమస్య. బ్రతక నేర్చిన బ్రిటిషువారు వలసరాజ్యాలన్నీ ఒకటితరువాత ఒకటి రెక్కలొచ్చిన పిట్టల్లాగ ఎగిరిపోవుట గమనించుటేగాక, కేపిటలిజముయొక్క లోపము గూడా హృద్గతము చేసుకొని జమీందారుల మృగయా వినోదార్థము వున్న అరణ్యములును, నేడు కార్మికులకిచ్చి వ్యవసాయము చేయించుచున్నారు. ధనరాసులకంటె ధాన్యరాసులవుసరమని అందులకై అనవరతము ప్రయత్నించుచున్నది బ్రిటన్ ప్రభుత్వము.

ఐర్లెండు: జనసంఖ్య 43 లక్షలు. ఐర్లెండు వ్యవసాయ దేశమే కాని, అచ్చటి భూమిఅంతయు కొద్దిమంది ఆంగ్లేయ జమీందారుల హస్తగతమై యుండెను. అందుచే మనదేశమందలి జమీన్ రైతుల బాధలన్నీ అచ్చటకూడా వుండేవి. అచ్చటి రైతులు రైతులుకారు, ఆంగ్ల జమీందారుల పాలేళ్లు. ఐర్లండు స్వాతంత్రము పొందినవెంటనే ఆంగ్ల జమీందారులకు కొంత ప్రతిఫలమొసగి ఆ భూమినంతయు రైతులకు పంచి వారి చెర విడిపించిరి. నేటి ప్రభుత్వము రైతుల అభివృద్ధికై అన్ని విధముల పాటుపడుచున్నది.

ఫ్రాన్సు: జనసంఖ్య 4 కోట్లు. ఫ్రాన్సు విప్లవాలకు పుట్టినిల్లు కదా! పారిశ్రామికముగా అభివృద్ధి చెందినట్లుగనే వ్యవసాయముగా కూడా ముందడుగేస్తున్నది. యిచ్చట నూటికి 30 మంది రైతాంగము. ఫ్రాన్సు రైతులు కష్టపడి మంచి ఆదాయమును పొందుచున్నారు. వారు నవలె వడ్డీ వ్యాపారస్తులవద్దకు, బ్యాంకులకు పరుగెత్తకపోవుటే క, తమ ధనమును బ్యాంకులలో డిపాజిట్లు చేస్తున్నారు. ఫ్రాన్సు ర్నమెంటు ధరలు తగ్గకుండా కంట్రోలుచేస్తుంది. మన ప్రభుత్వ స్తితి దీనికి విరుద్ధముకదా? మనదేశములో రయితు ఎట్లు కోలు నగలడు?

స్పెయిన్: జనసంఖ్య 2 కోట్ల 40 లక్షలు స్పెయిను దేశము ను మన దేశమునకు పోలికలు చాలాకలవు. అచ్చట నూటికి 80 మంది యితులు. భూమిఅంతయు జమీందారులది. రైతులు అచ్చముగా న రైతులమాదిరి అమాయకులు. నోరువాయిలేని మూగరైతాంగము. మ హక్కులకోసము ప్రయత్నింతమన్న కోర్కెలేదు వారికి. కాని ందరు సామ్యవాదుల ప్రబోధమువల్ల చైతన్యముకలిగి రైతులు జమీం దారుల భూములు ఆక్రమింపజొచ్చిరి. జమీందారులకు రైతులకు సంఘర్షణ జరుగుచున్న తరుణములో ప్రభుత్వము జోక్యముకలిగించుకొని

భూమినంతయు జిరాయితీ కప్పించింది. బ్రతుకు జీవుడాయని జమీందారు లొప్పుకొనుటయేగాక, జ్ఞానోదయముకల్గి రైతులతో సమరసబుద్ధిని మెలగుచున్నారు. యింతలో 1931 సం॥ రాజును తొలగించి ఏర్పడ్డ ప్రజాప్రభుత్వాన్ని పడదోయుటానికి ఫాసిస్టు ఫ్రాంకో నియంత ఆధ్వర్యముక్రింద అంతర్యుద్ధముకలిగి, (1936-38) ప్రపంచ ఫాసిస్టుల ప్రోద్బల ప్రోత్సాహములతో ప్రజాప్రభుత్వము భగ్నపరుపబడెను. అచ్చట ప్రభుత్వతిరోమకలకు జమీందారీ రైతుసమస్యయే కారణమని విశదీకరించ నవుసరములేదు.

స్విట్జర్లండు: జనసంఖ్య 42 లక్షలు, హాలెండు 87, డెన్మార్కు 38: ఈ దేశములలో ఆధునిక నాగరికత అభివృద్ధిచెందినను, ప్రాచీన సభ్యత పూర్తిగా నశించలేదు. అందులకు నిదర్శనము కర్మాగారములనుపెట్టి కుటీర పరిశ్రమలను కూలద్రోయకపోవుటయే. అక్కడ పల్లెలకే ప్రాధాన్యతకలదు. ఆ దేశము వ్యవసాయము చక్కని నూతన పద్ధతులపై చేయబడుచున్నది. పాడిపంటలు పొంగి ప్రవహిస్తున్నాయి. ప్రజలకు సరిపోగా మిగిలిన ఆహారవస్తువులను వివిధదేశములకు సహకార పద్ధతులమీద ఎగుమతిచేయుచున్నారు. సామ్రాజ్యాధిపతివా, సవాద్యాధిపతివా అన్న సామెత ఈ ప్రాంతముల సార్థకతజెందింది. డెన్మార్కులోని జమీందారీలనుకొని రైతులపరంచేసింది ఆ ప్రభుత్వం.

బాల్కను దేశములు. జమీందారులకు ఎట్టి ప్రతిఫలమును యివ్వకనే వారి స్వాధీనమందున్న భూములను రైతులకు పంచిపెట్టినవి. ఆ ప్రభుత్వములు భూములను పంచుటతో తృప్తి నొందక, వ్యవసాయ పరపతిని వ్యవసాయపు వస్తువులను తదితర సహాయములను చేసి, తమ తమ రాష్ట్రములను సస్యసమృద్ధి మొనరించెను.

ఇటలీ: జనసంఖ్య 4 కోట్ల 50 లక్షలు. ముస్సోలినీ కూడా రైతు సమస్య రమణీయముగానే పరిష్కరించాడు. భూమి శిస్తు అచ్చట నూటికి 10 వంతులే.

జర్మనీ: జనసంఖ్య 8 కోట్ల 30 లక్షలు. రైతాంగము 3 వ వంతు. ప్రపంచాన్నంతా మారణ హోమంగామార్చిన హిట్లరు ఒకశాసనము జారీచేశాడు; ఒక కుటుంబానికి కావలసిన కూడు గుడ్డ యితర వస్తువులు యివ్వగలిగినంత పెద్దదిగా భూఖండము వుండవలెనని. ఈ శాసనమువల్ల ఏర్పడిన భూములు అన్నదమ్ములు పంచుకోరాదు. అప్పుసప్పుల కమ్మకో రాదు. తాకట్లు పెట్టరాదు.

రష్యా: జనసంఖ్య 19 కోట్ల 30 లక్షలు. మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం రష్యాను పరిపాలించినది నిరంకుశులైన జారు ప్రభువులు. అచ్చటి భూమి అంతయు జమీందారుల స్వాధీనమందే యుండెను. వారు బానిసలచే వ్యవసాయము చేయించుచుండిరి. ఐరోపా మహా సంగ్రామానంతరము, అచ్చట మహా విప్లవము విజృంభించుటచే రాజు తరాజై జమీందారులు పేరు వూరు లేకుండా నాశనము చేయబడిరి. భూములన్నీ సమిష్టి వ్యవసాయములలోనికి తీసుకొనిరాబడి నవ్యపద్ధతులపై వ్యవసాయమభివృద్ధి చెందించుకొనుటయేగాక, లోకమునకు మార్గదర్శకులైరి. అచ్చట ఆదాయము ననుసరించి పన్ను వేయబడును గాన రైతాంగములో 3 వ వంతునకు యెట్టి పన్ను చెల్లించనక్కరలేదు. యంత్రసాహాయము వ్యవసాయమున కెక్కువగా నుపయోగించుకొని మానవశక్తిని వైజ్ఞానికాభివృద్ధికి వినియోగించుచున్నారు.

టర్కీ: జనసంఖ్య 1 కోటి 65 లక్షలు. టర్కీకూడా మన దేశమువలెనే వ్యవసాయకదేశము. మనదేశములోవలెనే అచ్చట గృహ పరిశ్రమలుకూడా పాశ్చాత్యుల పోటీకి తాళజాలక కేవలము వ్యవసాయ దేశమైనది. ఐరోపా సంగ్రామానంతరము సుల్తానును సాగనంపి కెమాల్ పాషా నాయకత్వమున ప్రజాప్రభుత్వము స్థాపించబడినది. ప్రాచీనా చారములు నశించి నేడు టర్కీ అన్నివిధములు అభివృద్ధిలో నున్నది. అచటి రైతులకు ప్రభుత్వము అన్నివిధముల సాయముచేయుచున్నది.

వ్యవసాయపు బ్యాంకులను పెట్టి వుచితముగ రైతులకు అప్పునిచ్చు చున్నారు. బీద రైతులకు విత్తనములు, ఎరువులు, వ్యవసాయపు పనిముట్లు వుచితముగా పంచుచున్నారు.

ప్రాచీన కాలమునుండి పండిన పంటలో పదవభాగము తురుష్క ప్రభుత్వము రైతులనుండి పన్ను రూపముగ వసూలుచేయుచున్న పద్ధతి రద్దుచేసి, నేడు రైతుల ఖర్చులన్నీ పోను నికరాదాయముమీద మాత్రమే ఆదాయపు పన్ను వసూలుచేయుచున్నది. కాన బీద రైతులకు పన్నుల భారము పూర్తిగా తొలగెను.

ఆస్ట్రేలియా : జనసంఖ్య 70 లక్షలు. ఇక్కడకూడ భూమి జమీందారులదే యగుటచే రైతులు దరిదాపు అంతులేని దారిద్ర్యములో యుండిరి. ఈ దుస్థితి గ్రహించి ప్రభుత్వము జమీందారీలను కొని రైతులకు పంచిపెట్టి దేశమును సుభిక్ష మొనర్చెను.

జపాను : జనసంఖ్య 7 కోట్ల 80 లక్షలు. శైతాంగము నూటికి 48 మంది. జపానునందును రైతుల స్వాధీనములో భూములు లేకుండెను. అక్కడ భూమి "సమూరే" లనబడు జమీందారుల స్వాధీనములో వుండెను. కాని ఆ జమీందారులే స్వయముగ భూమిని ప్రభుత్వపరము చేసి ప్రపంచమునకు ఆదర్శ పురుషులైరి. చైనా స్వాతంత్ర్యము అరికట్టుచు, 7 సంవత్సరములనుండి యుద్ధము చేస్తూ, మనదేశభక్తులకు నిలయమై స్వర్గతుల్యమని ప్రభుత్వమువారు చెప్పే అండమానుదీవులను హరించి, దుర్భేద్యమైన సింగపూరున భేదించి, బర్మాను కబళించి తృప్తి చెందని ఫాసిస్టు ప్రభుత్వముకూడా; నూతన పద్ధతులతో వ్యవసాయము చేయించుచూ రైతులకు బాసటయై నిలచిందంటే ఆశ్చర్యపోత నేడు జపాను రైతు రాతిభూములలో రసాయనిక పదార్థములద్వారా మనకంటె 3 రెట్లు హెచ్చు పంటను పండించగల్గుచున్నాడు.

చైనా : జనసంఖ్య 45 కోట్లు. చీనావారు నల్లమందు భాయీలు. దారిద్ర్యములో, వ్యవసాయములో అన్నిట మనదేశపు రైతులను పోలినవారు. చీనా పేరునకు స్వాతంత్ర్యదేశము. అచ్చటకూడా జమీందారీ విధానము వున్నది. భూమి చక్కలుముక్కలు చేయబడ్డది. కమ్యూనిస్టు ప్రభుత్వము స్థాపించబడిన రాష్ట్రిలలో మాత్రము రైతు రుణభారము, శిస్తుభారము తగ్గింపబడుటయేగాక జమీందారీ విధానము రద్దుగావింపబడి భూమి రైతాంగమునకు స్వాధీనముగావింపబడినది.

అమెరికా : జనసంఖ్య 27 కోట్ల 13 లక్షలు. రైతాంగము నూటికి 20 మంది. సంయుక్త రాష్ట్రిముల ప్రత్యేకజనసంఖ్య 13 కోట్లు. ఈ నూతన ప్రపంచములో అంతా నూతనమే. ప్రపంచములోని సగ పాలు బంగారము అమెరికా చేరుకొన్నది. అయిన వారు వ్యవసాయము మరువలేదు. వ్యవసాయము నూతన పద్ధతులమీద లాభకరముగా చేయ బడుచున్నది. ఎట్టి బీద నేలకూడా వృధాగానుండుటలేదు. అచ్చట బీద భూములకు "రెన్ పెల్ జూ" టానిక్‌ను (బలవర్ధకౌషధము) వుపయోగించి, తక్కువ వ్యయముతో ఎక్కువ ప్రయోజనము పొందుచున్నారు. మేమని చెప్పదుమక్కడిచిత్రాలు ! పురుషసంయోగము లేకుండానే సంతానోపాయములు కల్గించినట్లుగానే, భూమిలేకుండానే కృత్రిమముగా బంగాళాదుంపలు వగైరా పండించుచున్నారు. వ్యవసాయ విద్యాప్రచారమునకై కోట్లకొలది ఖర్చుచేయుచున్నారు. వ్యవసాయ ప్రధానమైన మన దేశములో ఆదర్శ వ్యవసాయ కేంద్రములు అరుదుగా వుంటే, అచ్చట ప్రత్యేక రైళ్ళపైన వ్యవసాయ ప్రవీణులచే ప్రబోధము చేయించుటయేగాక, అందు వ్యవసాయ కేంద్రములను గూడా ఏర్పాటు చేసి కృషి నమోఘమొనరించుచున్నారు.

యిచ్చట ప్రభుత్వము రైతునకు కేవలము దాసత్వము చేయుచున్నది. శాసనసభ్యులు రైతు కనుకూలముగా శాసనముచేస్తే, రైతులు

పాలములువదలి రాజధానిని ప్రవేశించి, శాసనసభ్యులచే ఆ చట్టమును బలవంతముగా తిరుగ తోడించగలరు. అచ్చటిరైతులు, మనదేశపు రైతులవలె విద్యావిహీనులుగారు. రాజకీయ సమస్యలను తమకనుకూలముగా పరిష్కరించుకొనగల ప్రజ్ఞాశీలురు.

ఇక మనదేశమా : 40 కోట్ల జన సంఖ్యగల వ్యవసాయకదేశము, నూటికి 80 మంది రయితాంగము. చేతివృత్తులు చెడిపోవుటచే వ్యవసాయమే జీవనాధార మైనది. రయితులు దుర్భర దారిద్ర్యములోబడి నశించుచున్నారు. నూతన వ్యవసాయ పద్ధతులవలంబించుటలేదని, తాతలనాటి ఆచారములనే అనుసరిస్తున్నారని, భూములకు మంచి ఎరువగు పశువులపేడ వంటచెరకు నిమిత్తం కాల్చివేస్తారని, రయితుల నిజస్థితిని గుర్తెరుగని రాజకీయవేత్తలు గ్రంథకర్తలు రాళ్లురువ్వుతారు. కాని అజ్ఞాన దారిద్ర్యములలో మునిగి ఆకలిమంటలతో దినదినము కృంగి కృశించి నశించి వ్యవసాయకూలీలుగా మారుచున్న రయితులను, ఆదరించి అతనికి అండాదండాగా వుండేవారు అరుదు. ఈ విషయములో అప్రియమైనను ఒకసత్యము చెప్పక తప్పదు. ప్రభుత్వము చేయూతనిచ్చుటలేదు సరికదా, ప్రజానాయకులను కొనువారుగాని, మన దేశములోవున్న వివిధ రాజకీయపక్షములవారుగాని, రయితుసమస్య ప్రధానసమస్యగా నెంచుటలేదు. కాంగ్రెసు అప్పుడప్పుడూ బార్డోలీ మొదలగు ప్రాంతాలలో రయితునకు అండదండగా వుండకపోలేదు. జమీందారులు ఎలెక్షనులలో, కారుకూతలతో, బాజా బజంత్రీలతో, వందిమాగధ బృందములతో వోటు భిక్షకై వచ్చి ధర్మోపన్యాసములు గావించి మరల కంటికి కనబడనట్లుగానే, వివిధ రాజకీయ వర్గములవారు కూడా తమ రాజకీయ సిద్ధాంతాలను రయితులనెత్తిన రుద్దుటకొరకేగాని రయితు క్షేమముకొరకు గాదు. న్యాయంగా వీరంతా రయితు క్షేమమునకే యత్నిస్తే రయితు స్థితి మారకుండునా ?

ఈ పార్టీలు చ[illegible]న్నట్లు రయితు సంఘాలలో కూడా ఎన్నో విభేదాలు. దీనికంతకు కారణము వివిధపార్టీలు బురఖాలతో రయితోద్ధారకులుగా ప్రవేశించి తమపార్టీ ఆశయాలకు ప్రాముఖ్యతనిస్తూ రయితుసమస్యలను విస్మరించి యేటికొకరు కాటికొకరు లాగుతూ, అమాయక రయితాంగములో అలజడి కలుగజేయుచున్నారు.

ఇక ప్రభుత్వమువారు, యీ ఆంగ్లప్రభుత్వము అర్ధరాజ్యాన్ని తమ దత్త పుత్రులకిచ్చి (జమీందారులు) మనలను ఘోరదరిద్ర పంకిలములోదించినది. ప్రపంచమంతా జమీందారీ యుగమునుండి కేపిటలిజము లోనికి, కేపిటలిజమునుండి కమ్యూనిజములోనికి, కాలక్రమము ననుసరించి అభివృద్ధి నొందుచున్న ఈ రోజులలో తానీపాలనాటినిరంకుశ పద్ధతుల నుండి మనల విముక్తులన చేయక పోవుట అల్పరాష్ట్ర స్వాతంత్ర్య సంరక్షణార్థమై ఆయుధము బూనినామని, ప్రపంచమునుండి క్రూరదాస్యత్వము తొలగింప కంకణము కట్టుకొన్నామని ఎలుగెత్తి అరచే ఆంగ్లప్రభుత్వము ఏ సమాధానం చెప్పనోలోకానికి? ఎన్నాళ్లుమసిపూసి మారేడుకాయ చేయుట? కొసగలమాట ఏమంటే వారిని వీరిని నిందించిన ప్రయోజనము లేదు. రౌతుకొద్ది గుఱ్ఱమన్నట్లుండును ప్రభుత్వము. మన రైతాంగములో ఎంతత్యాగము, రాజకీయ స్వతంత్రకాంక్ష కన్పరచగలమో అంతే ప్రయోజనము పొందగలము. మన కష్టసుఖమ్ములను గమనించి మనకాప్తులెవరో అన్యులెవరో ఎరిగి మనకాళ్లపై మనము నిలువగలిగి కార్యదీక్షకు కంకణము గట్టుకొని జమీందారీ దాస్యవిమోచనకు, కృతప్రారంభులమైనప్పుడే మనకు విముక్తి.

---

Printed at Renaissance Printers Ltd., T. Nagar, Madras.